పద్మనాభం సమర్పించు 1000 నవ్వుల హాస్య చిత్రం

రేఖా & మురళీ ప్రొడక్షన్స్

# ఆజన్మ బ్రహ్మచారి

నిర్మాత
బి. పురుషోత్తం

స్క్రీన్ ప్లే - దర్శకత్వం.
పద్మనాభం

సంగీతం: ఎస్.పి. కోదండపాణి





ఈ నవ్వు

# అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్

వల్లనే కదా!

అజీర్ణం, వాయువు, కలతనిద్ర, వాంతులు, విరేచనాలవంటి బాధలు వెంటనే తగ్గిపోతాయి. ఆకలి, జీర్ణశక్తి బాగా ఉంటాయి., పాపాయి ఆరోగ్యం బాగుపడుతుంది.




అమృతాంజన్ లిమిటెడ్

FDS AG 1659 TEL A..



అవును—

# శాలోఫెన్

## బాధానివారిణి మాత్రలు

అమృతాంజన్ లిమిటెడ్ వారి తయారింపు

తలనొప్పి, ఫ్లూ, పంటినొప్పి, ఒళ్లునొప్పులని వెంటనే పోగొడ్తాయి

శాలోఫెన్‌లోని ఔషధాలు డాక్టర్లు సిఫార్సు చేసేవే.

శాలోఫెన్ ఉన్నచోట బాధ ఉండదు.




FDSAS-1808-TE



# చందమామ

సంస్థాపకుడు: నాగిరెడ్డి
సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ ["పితృధర్మం"] ఎస్. రామనాగేశ్వరరావు రచన. ప్రతి మనిషీ కొడుకు బాధ్యతలూ, తండ్రి బాధ్యతలూ కూడా నిర్వర్తించాలి. సాధారణంగా ఈ రెండు బాధ్యతల మధ్యా వైరుధ్యం ఏర్పడిన పరిస్థితిని మనం ఈ కథలో చూస్తాం.

ఒకప్పుడు చోరవిద్యను అరవై నాలుగు కళలలో ఒకటిగా భావించేవారు. కాని చోరులు సంఘద్రోహులు గనక వారి విద్యపట్ల ఆదరం నశించింది. కాని అది "కష్టమైనవిద్య" అవును.

సంపుటి 52 ఫిబ్రవరి'73 సంచిక 2

CHITRA



# పరువుతక్కువ సంబంధం

ఒక జమీందారుకు నలుగురు కుమార్తెలు. వాళ్ళకు పెళ్ళి యీడు వచ్చాక ఆయన ఒక్కొక్కరికీ ఘనమైన సంబంధం చూసి, అల్లుడు ఇల్లరికం ఉండే షరతు మీద పెళ్ళిళ్ళు చేశాడు.

జమీందారు నాలుగో కుమార్తె వంతు వచ్చింది. చిన్నతనం నుంచీ తమ ఇంటనే పెరిగి చాకిరి చేసే రాముడు అనే అనాథను తప్ప మరొకరిని చేసుకోనని ఆ పిల్ల పట్టు బట్టింది. జమీందారుకు ఇది ఏ మాత్రమూ ఇష్టంలేదు. అయినా ఆయన తన ఆఖరు కుమార్తెను రాముడికిచ్చి పెళ్ళి చేసి, ఆమెతో, "నీ భర్తను నేను ఇల్లరికం ఉంచుకోను. నువు వెళ్ళి వాడితోబాటు విడిగా కాపరం చెయ్యి. నీ యిష్టం నెరవేర్చాను గాని, నీ మూలంగా నీ అక్కలకూ, వాళ్ళ భర్తలకూ అవమానం చెయ్యలేను," అని చెప్పాడు.

ఈ సంగతి వింటూనే రాముడు పారిపోయాడు. తన మూలంగా జమీందారు కూతురు దాసీ దాని స్థానానికి దిగజారటం అతనికి ఇష్టంలేకపోయింది. తాను కూడా తన అదృష్టాన్ని వెతుక్కొని, అది తనకు దొరికిననాడు తన భార్య పరువుగా జీవించేటట్టు చూడాలనే రాముడి ఉద్దేశం.

ఈ ఉద్దేశంతో రాముడు మర్నాడు మధ్యాన్నందాకా ఆగకుండా నడిచి, ఒక పట్టణం సమీపంలో అరణ్యం మధ్య నున్న పెద్ద మైదానాన్ని చేరుకున్నాడు.

ఆ మైదానంలో పెద్ద ఆవుల మంద మేస్తున్నది. ఒక చెట్టు నీడన కూర్చుని ఒక వృద్ధుడు అన్నం మూట విప్పుకుంటూ రాముడికి కనిపించాడు.

అంతలోనే మందలో ఒక చూడి ఆవు తన్నుకోసాగింది. విప్పిన అన్నం మూటను అలాగే వదిలేసి వృద్ధుడు ఆ ఆవు వద్దకు

పి. అనంతకృష్ణశర్మ

వెళ్ళి, అది ఊనిన దాకా ఉండి, చెయ్యవలసినదంతా చేశాడు. వృద్ధుడు అలా వెళ్ళగానే అన్నం మూట దగ్గిరికి కాకులూ, కుక్కలూ రాసాగాయి. రాముడు వాటిని తరిమేసి, వృద్ధుడు చేతులు కడుక్కొని వచ్చినదాకా ఆ మూటకు కాపలాకాశాడు.

"నా భోజనం కుక్కలపాలూ, కాకుల పాలూ కాకుండా కాపాడి చాలా మంచి పని చేశావు. ఎవరు నువు? ఎక్కడినుంచి వస్తున్నావు?" అంటూ వృద్ధుడు రాముణ్ణి ప్రశ్నలు వేశాడు.

"బతుకు తెరువు కోసం వెతుక్కుంటూ పోతున్నాను. నాకు ఒక వూరు అంటూ లేదు. నా కెవరూ లేరు," అన్నాడు రాముడు.

వృద్ధుడు రాముడికి తన భోజనంలో కొంత పెట్టి, తన సంగతి అంతా చెప్పాడు.

ఆ వృద్ధుడికి వంద ఆవుల మంద ఉన్నది. ఆ ఆవులు తప్ప ఆయనకు వేరే పిల్లలు లేరు. ఆవులను కాయటానికి మనుషులను పెట్టుకుంటే, వాళ్ళు ఆవులను అమ్మేసి డబ్బు చేసుకుని, తప్పిపోయాయని చెప్పారట. వాళ్ళతో వేగలేక తన మందను ఆయన తానే కాస్తున్నాడు.

"మీరు ఈ వయసులో సుఖంగా కూర్చోక ఆవులను కాయటం ఏమిటి? ఆవుల సేవా, మీ సేవా కూడా నేనే చూస్తాను. మీకు తోచినది ఇయ్యండి," అన్నాడు రాముడు.



అందుకు వృద్ధుడు సమ్మతించి రాముణ్ణి పనిలో పెట్టుకున్నాడు. ఆవులను పాలు పితకటమూ, పాలు అమ్మి డబ్బు తేవటమూ, మందను మేతకు తీసుకుపోయి ఇంటికి చేర్చటమూ రాముడే చెయ్యసాగాడు.

రెండు వారాలు రాముణ్ణి గమనించిన మీదట వాడు నిజాయితీ గలవాడని వృద్ధుడికి తెలిసిపోయింది. ఆయన రాముడితో, "నీకు నేనే మంచి సంబంధం చూసి పెళ్ళి చేస్తాను," అన్నాడు.

"లేదండీ, నాకు పెళ్ళి అయింది. ధనం సంపాదించటానికని ఇలా బయలుదేరాను." అంటూ రాముడు జరిగినది ఏదీ దాచకుండా వృద్ధుడికి చెప్పాడు.

వృద్ధుడు అంతా విని, ''అలాటప్పుడు నువు ఇంతకన్న మంచి పని చూసుకోక పోయావా? నా దగ్గిర పని చేస్తే నీ కేమి గిట్టుబాటు అవుతుందీ?'' అన్నాడు.

రాముడు నవ్వి, ''నేను ఇంతకన్న రాబడి వచ్చే పని ఏం చెయ్యగలను, బాబూ? డబ్బు వస్తే అదృష్టంగా రావాలి గాని, నేను పెద్దగా డబ్బు సంపాదించే శక్తి గల వాణ్ణి కాను. బుద్ధి తెలిసినప్పటి నుంచీ ఇలాటి పనులే చేస్తున్నాను. అదీగాక ఇల్లు వదిలినాక మొట్టమొదటగా మీ చేతి అన్నం తిన్నాను. మిమ్మల్ని సుఖపెట్టటమే నాకు పదివేలు అనిపించింది,'' అన్నాడు.

వృద్ధుడు మాట్లాడలేదు.

కొన్నాళ్ళు గడిచాక ఆయన రాముడితో, ''ఒరే నాయనా, ఆవులకు కొత్త పాక వేస్తే బాగుంటుంది. ఈ రాత్రికి నేను గుర్తులు పెట్టిన చోట గుంజలకు గోతులు తవ్వు. తరవాత పని రేపు చూద్దాం,'' అన్నాడు.

ఆ రాత్రి వృద్ధుడు పడుకున్న తరవాత రాముడు గోతులు తవ్వాడు. రెండు గోతులలో ధనపు బిందెలు దొరికాయి. రాముడు వాటిని లోపల పెట్టి, తెల్లవారగానే వృద్ధుడికి ఇచ్చేశాడు.

వృద్ధుడు వాటిని చూసి, ''నువు ఎదురు చూస్తున్న అదృష్టం నీకు కలిసి వచ్చింది గదా, వాటిని తీసుకుని నీ భార్య వద్దకు వెళ్ళక పోయావా?'' అని రాముడితో అన్నాడు. అవి ఆయన కావాలని పెట్టిన బిందెలే.

మీ సొత్తు నా అదృష్టం ఎలా అవుతుంది, బాబూ?'' అన్నాడు రాముడు.

''లేదు లేరా, నా ఆస్తికంతకూ నువే వారసుడివి. ఈ డబ్బుతో జమీందారు అల్లుడివి కాగలిగితే తీసుకుపో. లేదంటావా, నీ భార్యను ఇక్కడికి తీసుకు వచ్చి సుఖంగా ఉండు. నువే నా కొడుకువు. నీ భార్యే నా కోడలు అనుకుంటాను,'' అన్నాడు వృద్ధుడు.

రాముడు వెళ్ళి తన భార్యను వెంటబెట్టుకుని తిరిగి వచ్చి, వృద్ధుడి ఆస్తికి వారసుడై సుఖంగా జీవించాడు.






# భాగ్యదేవత

ఒక గ్రామంలో ఇద్దరు అన్నదమ్ములు ఉండేవారు. అన్న భాగ్యవంతుడు. తమ్ముడు దరిద్రుడు.

ఒక ఏడు అన్న పొలాలలో కోతలు పూర్తి అయాయి. ఆ పొలాలలో తమ్ముడు కాపలా కాస్తున్నాడు. అతను ఒక కుప్ప పక్కన కూర్చుని తన దీనస్థితిని గురించి ఆలోచిస్తూ ఉండగా, ఎక్కడి నుంచో ఒక స్త్రీ తెల్ల బట్టలు కట్టుకుని, పొలమంతా తిరుగుతూ, రాలిన కంకులను ఏరి గడ్డికి అంటిస్తూ అతనికి కనిపించింది.

ఆమె సమీపంగా రాగానే, తమ్ముడు లేచివెళ్ళి, ఆమె చెయ్యి పట్టుకుని, "ఎవరమ్మా నువ్వు? ఇక్కడ నీకేం పని?" అని అడిగాడు.

"నేను నీ అన్న భాగ్యదేవతను. రాలి పోయిన కంకులు వృథా పోకుండా గడ్డికి అంటిస్తున్నాను," అన్నదామె.

"అలాగా? అయితే మరి నా భాగ్య దేవత ఎక్కడ ఉన్నది?" అని తమ్ముడు ఆమెను అడిగాడు.

"ఆ కనిపించే దక్షిణపు కొండల అవతల ఉన్నది," అంటూ ఆమె అదృశ్యమైంది.

వెంటనే తమ్ముడు తన భాగ్యదేవత కోసం వెతుక్కుంటూ వెళ్ళటానికి నిశ్చయించుకున్నాడు. అతను తన గుడిసెకు వెళ్ళి, తన కున్న కొద్దిపాటి ఆస్తిని మూట గట్టుకుని బయలుదేరబోయాడు.

అంతలో పొయ్యి వెనక నుంచి దరిద్ర దేవత లేచి అతని వద్దకు వచ్చి, పెద్ద పెట్టున శోకాలు పెట్టి ఏడుస్తూ, "నన్నిక్కడ వదిలిపెట్టి పోతావా? నన్ను కూడా నీ వెంట తీసుకు వెళ్ళు," అన్నది.

చాలా దూరం వెళ్ళాలనీ, ఆమె అసలే అర్భకురాలనీ, నడవలేదనీ తమ్ముడు చెప్పి చూశాడు గాని, లాభం లేకపోయింది.

బొహీమియా జానపద కథ



చివరకు అతను, "సరే, అలాగే తీసుకు పోతాను. ఈ సీసాలో ప్రవేశించు. నా వస్తువులతో పాటు నిన్ను కూడా పట్టుకు పోతాను," అన్నాడు.

దరిద్రదేవత చిన్నదైపోయి సీసాలో ప్రవేశించింది. తమ్ముడు ఆ సీసాకు గట్టిగా బిరడా బిగించి, ఇంటి నుంచి బయలు దేరాడు. దారిలో అతనికి ఒక చోట ఊబి తగిలింది. దరిద్రదేవత ఉన్న సీసాను అతను ఆ ఊబిలో లోతుగా కూరి, దరిద్ర దేవతను వదిలించుకుని, ప్రయాణం సాగించాడు.

అతను దక్షిణపు కొండలను దాటి ఒక పట్టణం చేరుకున్నాడు. అక్కడ ఒక పెద్ద మనిషి తమ్ముడికి పని ఇవ్వటానికి ఒప్పుకున్నాడు.

"నాకు నేలమాళిగ ఒకటి తవ్విపెట్టాలి. అయితే నీకు నేను జీతం ఏమీ ఇయ్యను. కాని తవ్వేటప్పుడు నీకు ఏ నిధి నిక్షేపాలు దొరికినా అవి నీవే," అన్నాడు ఆ పెద్ద మనిషి.

తమ్ముడు అందుకు ఒప్పుకుని నేల మాళిగ తవ్వనారంభించాడు. ఒక గంట సేపైనా తవ్వాడో లేదో అతనికి కొంత బంగారం దొరికింది. పెద్ద మనిషి ఆ బంగారం తనదే అని చెప్పినప్పటికీ, తమ్ముడు అందులో సగం ఆ పెద్ద మనిషికి ఇచ్చేశాడు.

ఇంకా తవ్వుతూ పోగా నేల అడుగున ఒక కొట్టం లాటిది బయటపడింది. దానిలో బంగారు నాణాలూ, మణులూ కుప్పలు పోసి ఉన్నాయి. వాటితోబాటు ఒక పెద్ద పెట్టె కూడా ఉన్నది. అందులో నుంచి ఎవరో, "పెట్టె తెరు! పెట్టె తెరు!" అని అరవటం అతనికి వినిపించింది.

తమ్ముడు పెట్టె మూత పైకెత్తాడు. అందులో నుంచి ఒక స్త్రీ పైకి వచ్చింది. ఆమె కూడా తెల్లబట్టలు ధరించి ఉన్నది.

"నువు ఎవరు?" అని తమ్ముడు ఆమెను అడిగాడు.

"నేను నీ భాగ్యదేవతను. నా కోసమే కద నువు వెతుకుతున్నావు? ఇకనుంచీ నేను

నిన్నూ, నీ కుటుంబాన్నీ వదలకుండా కని పెట్టుకుని ఉంటాను." అన్నది ఆమె. వెంటనే ఆమె అదృశ్యమయింది.

నేల అడుగున దొరికిన నిధిని తమ్ముడు పెద్ద మనిషికి చూపించి అతడితో సమంగా పంచుకున్నాడు.

ఇప్పుడు తమ్ముడు కోటీశ్వరుడైనాడు. కాని అతను తాను పూర్వం అనుభవించిన దారిద్ర్యాన్ని మరిచిపోక, తన గ్రామానికి తిరిగి వచ్చినాక, కనిపించిన దరిద్రుల కందరికీ సహాయపడుతూ రాసాగాడు.

ఒకనాడు అన్నదమ్ము లిద్దరూ వీథిలో కలుసుకున్నారు. తమ్ముడు అన్నను కౌగ లించుకుని, తన ఇంటికి తీసుకు వచ్చి, జరిగినదంతా సవిస్తరంగా చెప్పాడు. అతను తన అన్నను చాలా రోజులు తన ఇంటనే ఉంచుకుని విందులుకుడిపి, వెళ్ళిపోయే టప్పుడు అతనికీ, అతని భార్యకూ, పిల్లలకూ విలువగల కానుకలు ఇచ్చి పంపేశాడు.

తమ్ముడి ఐశ్వర్యం చూసి అన్న సహించలేక అసూయపడ్డాడు. దరిద్ర దేవతను తిరిగి తమ్ముడి మీదికి పంపకం చెయ్యాలని అతనికి దుర్బుద్ధి పుట్టింది.

అన్న తన తమ్ముడు చెప్పిన ఊబి వద్దకు వెళ్ళి, ఎంతోసేపు శ్రమపడి వెతికి, తమ్ముడు పాతిపెట్టిన సీసాను పైకి తీసి, బిరడా తెరిచాడు.

మరుక్షణమే సీసా నుంచి దరిద్రదేవత పైకి వచ్చి అన్నను వాటేసుకున్నది; "నువ్వు ఎంత పుణ్యాత్ముడివి ! నాకు ఈ మేలు చేసి నందుకు నిన్ను ఎన్నటికీ విడిచిపెట్టను. బతికి ఉన్నంత కాలమూ నీ వెంటనే ఉంటాను," అన్నది.

అన్న ఆమెను తిరిగి పాతిపెట్టాలని చూశాడు, నదిలో ముంచుదామనుకున్నాడు. కాని అతని ప్రయత్నాలేవీ కొనసాగలేదు. దారిలో అతన్ని దొంగలు దోచి, తమ్ము డిచ్చిన కానుకలు కాజేశారు. అతను ఇంటికి చేరేసరికి అతని ఇల్లూ, గాదెలూ, వాములూ తగలబడిపోయి ఉన్నాయి. అతని పొలా లలో పంట వరద వచ్చి కొట్టుకుపోయింది. అతను సర్వనాశనం అయిపోయాడు.





# అమరవాణి

సింహ శ్శిశు రపి నిపతతి మదమలినకపోలభిత్తిషు గజేషు,
ప్రకృతి రియం సత్త్వవతాం న ఖలు వయ స్తేజసాం హేతుః. 1

[పిల్లగా ఉంది కూడా సింహం మదపుటేనుగుల కుంభస్థలాల పైకి దూకుతుంది. సత్త్వవంతుల ప్రతిభకు వయసుతో నిమిత్తం లేదుకదా!]

రథస్యైకం చక్రం, భుజగనమితా స్సప్తతురగా,
నిరాలంబో మార్గః, చరణవికల స్సారథిరపి,
రవి ర్యాత్యే వాంతం ప్రతిదిన మపారస్య, నభసః;
క్రియాసిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణే. 2

[ఒంటి చక్రంగల రథమూ, పాములే కళ్ళాలూ, ఆధారంలేని దారి, కుంటిసారథి (అనూరుడు) కలిగి కూడా సూర్యుడు అంతులేని ఆకాశంలో ప్రయాణం చేస్తున్నాడు. సత్త్వవంతులయిన మహాత్ములకు సాధనాలు కావాలా ?]

విజేతవ్యా లంకా, చరణతరణీయో జలనిధిః,
విపక్షః పౌలస్త్యో, రణభువి సహాయాశ్చ కపయః,
పదాతి ర్మర్త్యోసౌ సకలమవధీ ద్రాక్షసకులం;
క్రియాసిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణే. 3

[జయించవలసినది లంకాపురి, కాలినడకన సముద్రం దాటాలి, శత్రువు రావణాసురుడు, సహాయులు కోతులు, తాను (రాముడు) మానవమాత్రుడు, అయినా రాక్షసనమూహాన్ని చంపేశాడు. సత్త్వవంతులైన మహాత్ములకు సాధనాలు కావాలా ?]

సత్త్వవంతులు



# యక్షపర్వతం

## 9

[ఖడ్గ జీవదత్తులు సింహాన్ని మరొక శిధిల భవనంలోకి తరిమి, ఆ ప్రాంతం నుంచి బయటపడేందుకు దారి వెతుక్కుంటూ బయలుదేరారు. వాళ్ళకు ఒక గదిలో చాలా ధాన్యం బస్తాలు కనిపించినై. వాటికి వాళ్ళు నిప్పుపెట్టారు. అంతలో పక్కగది నుంచి అరుపులు వినిపించినై. వాళ్ళు వెళ్ళి చూడగా ఒక వృద్ధుడు కనిపించాడు. తరవాత—]

ఖడ్గ జీవదత్తుల్ని చూస్తూనే ఆ వృద్ధుడు, "ఎవరు మీరు? ఆ దొంగ పూజారిణి శిష్యుల్లా లేరే? ఎవరైతే నేం, నన్ను రక్షించండి. పక్క గదిలో ధాన్యం కాలిపోతున్నదిలా వుంది! ఆ వేడికి నేను బంధించబడి వున్న గోడ వేడెక్కి నా శరీరం కాలుతున్నది," అన్నాడు.

"కొంచెం వుంటే మొత్తం గది కప్పె, లోపలికి కూలి పడుతుంది!" అంటూ జీవదత్తుడు వృద్ధుణ్ణి సమీపించి, దండంతో అతడికి కట్టి వున్న ఇనపగొలుసులను విరగ్గొట్టి, అతణ్ణి బయటికి తీసుకువచ్చాడు.

వృద్ధుడు ఆత్రంగా చుట్టూ ఓ మారు కలయ చూసి, "ఎన్నాళ్ళ తర్వాత నాకు తిరిగి స్వేచ్ఛ కలిగింది! ఆ దొంగ పూజారిణి యింకా యీ శిధిలనగరంలో అధికారం చెలాయిస్తున్నదా? మీ రెవరు?" అని అడిగాడు.



"మే మెవరం అయితేనేం, నువు చెప్పే ఆ పూజారిణి శిష్యులం మాత్రం కాదు. వింధ్యపర్వత ప్రాంతాలకు ఒక గొప్ప పని మీద బయలుదేరి దారిలో చిన్నా పెద్ద ఆటం కాల్లో, ఆపదల్లో చిక్కుకుని, యిక్కడికి చేరాం. నీ మాటలు వింటూంటే నువ్వే యిక్కడి అసలు పూజారివనీ, యిప్పుడు గద్దె ఎక్కి కూర్చున్న పూజారిణే నిన్నీ చీకటి గదిలో బంధించిందనీ తెలుస్తున్నది, అవునా?" అని ప్రశ్నించాడు జీవదత్తుడు.

"జరిగిందదే! ఆ నీచురాలు యిప్పటికి యిరవైఏళ్ళ క్రితం యింత బాలికగా నాకు అరణ్యంలో దొరికింది. తెచ్చి సాకాను. ఎన్నో విద్యలూ — మంత్రశాస్త్రం అంతా బోధించాను. కాని, ఏ మాత్రం కృతజ్ఞత లేకుండా రెండేళ్ళక్రితం, ఒక భయంకర కాళరాత్రి వేళ, పెద్ద ఉరుములూ, మెరుపులతో కుండపోతగా వర్షం కురుస్తున్న సమయంలో...."

జీవదత్తుడు వృద్ధ మంత్రవేత్త మాటలకు అడ్డు వచ్చి, "మీ గత చరిత్ర అంతా వినే తీరుబాటు మాకు లేదు. పూజారిణి బారి నుంచి బయటపడి అరణ్యం చేరాలని చూస్తున్నాం. ఆవిడ మమ్మల్ని పట్టుకునేం దుకు శిష్యగణంతో బయలుదేరే వుంటుంది! మీ రిక్కడే వుంటారా లేక యీ కూలి పోతున్న కొంపల్లో నుంచి విశాల ప్రపం చంలోకి పోయే మార్గం చూపి, మా వెంట అరణ్యం చేరుతారా? ముందు ఆ సంగతి చెప్పండి," అన్నాడు.

"పగ తీర్చుకోకుండా — ఆ దొంగ పూజా రిణిని హతం చెయ్యకుండా నేనిక్కణ్ణుంచి కదలను. నన్ను యీ స్థితిలో చూస్తే, నా పాత శిష్యులు కొందరు తప్పక నా పక్షం అవుతారు. వాళ్ళ సాయంతో ఆ కృతఘ్ను రాల్ని పట్టుకుని ముక్కలు ముక్కలుగా నరికి కాకులకూ, గద్దలకూ ఆహారంగా వేస్తాను," అన్నాడు ముసలి మాంత్రికుడు పళ్ళు కొరుకుతూ.

ఆ మాటలకు ఖడ్గవర్మ అయిష్టంగా తలా డిస్తూ, "జీవా! ఇక మన దారిన మనం

పోవటం మంచిది. ఈ మాంత్రికుల్నీ, పూజారుల్నీ ఒకళ్ళగొంతు ఒకళ్ళు కోసుకోనీ!" అంటూ బయలుదేరాడు.

జీవదత్తుడు అతడితోబాటు కదిలి వృద్ధ మాంత్రికుడితో, "ఆ దొంగ పూజారిణిని పట్టుకుని ముక్కలుగా నరికి కాకులకూ, గద్దలకూ వేయటం ఎందుకు! ఈ ప్రాంతాల ఎక్కడో ఆకలిగొన్న సింహం ఒకటి తిరుగుతున్నది. దానికి వెయ్యి. ఇంత పుణ్యమైనా నీకు దక్కుతుంది," అన్నాడు.

వృద్ధ మాంత్రికుడు ఏదో మాట్లాడబోయాడు. కాని, అంతలో ఒక శిథిలభవనం వెనక నుంచి పూజారిణి మాంత్రికుడూ, జడలభూతంతోపాటు, అయిదారుగురు శిష్యుల్ని వెంట బెట్టుకుని హఠాత్తుగా ముందుకు వచ్చి, ముసలి మాంత్రికుణ్ణీ, ఖడ్గ జీవదత్తుల్నీ చూసి, కళ్ళెర్ర చేసి, చేతిలోని శూలాన్ని పైకెత్తి, "ఆహాఁ, ముసలి వెధవ చీకటికొట్లో నుంచి బయటపడ్డాడా? దొంగల్లా నగరం ప్రవేశించిన మనుషులు కూడా యిక్కడే వున్నారు! అందర్నీ పట్టుకుని మహా భూతానికి బలి చేస్తాను," అంటూ ముందుకు రాసాగింది.

ఖడ్గవర్మ చప్పున నాలుగడుగులు వెనక్కు వేసి బాణం పూజారిణి కేసి ఎక్కుపెట్టి, "పూజారిణీ! మరొక్క అడుగు ముందుకు వేశావంటే, యీ వాడి అంబు నీ కంఠాన్ని



ఛేదిస్తుంది, జాగ్రత్త!" అని హెచ్చరించాడు.

ఆ హెచ్చరిక వింటూనే పూజారిణి వున్నచోటునే కదలకుండా నిలబడింది. మాంత్రికుడూ, జడలభూతం కొంచెం పక్కగా వెళ్ళి నిలబడ్డారు. ఒకటి రెండుక్షణాల నిశ్శబ్దం తరవాత పూజారిణి భృత్యులో ఒకడు తన చేతగల శూలాన్ని గాలిలో గిరగిరా తిప్పి, "మహాశక్తి పూజారిణీ! ఇంకా ఆలశ్యం ఎందుకు? ముసలి పూజారినీ, ఈ కొత్త వాళ్ళిద్దర్నీ నీ మంత్రశక్తితో భస్మం చేసెయ్యి," అన్నాడు.

"ఉహూఁ, అలా భస్మం చేయదలచుకోలేదు. ముగ్గుర్నీ ప్రాణాలతో పట్టుకుని మహా




భూతానికి బలి పెట్టాలి," అంటూ పూజారిణి పక్కకు తిరిగి మాంత్రికుడూ, జడల భూతాలతో, "ఒరే, అలా నిలబడి నేల చూపులు చూస్తారేం? ముందు ఆ యువకు లిద్దర్నీ పట్టి బంధించండి. ఈలోపల ముసలి మాంత్రికుడి సంగతి నేను చూస్తాను," అన్నది పళ్ళు కొరుకుతూ.

ఆ మాటలకు ఖడ్గ జీవదత్తులు పెద్దగా నవ్వారు. జీవదత్తుడు జడలభూతం కేసి ఒకడుగు వేసి, "ఏరా, వికృత భూతం! నువ్వు ఆడభూతానివో, మగభూతానివో కూడా మాకు తెలియటం లేదు. ఏం, మీ గురువు ఆజ్ఞాపించినట్టు, మమ్మల్ని పట్టుకోక, అలా నిలబడి వున్నావేం?" అని అడిగాడు.

జడలభూతం ఆ మాటలకు కొంచెంగా బెదిరి మాంత్రికుడికి దగ్గరగా పోయి నిలబడి, "గురో, యిప్పుడేం చేయటం? ఆ ఇద్దర్నీ పట్టుకుని విరుచుకు తినేదా?" అన్నది.

"తప్పురా, శిష్యా. తప్పు! మహాశక్తి పూజారిణి వాళ్ళను ప్రాణాలతో పట్టుకుని మహా భూతానికి ఆహారం చేయబోతున్నది, మనం తొందర పడకూడదు!" అన్నాడు.

మాంత్రికుడు యిలా అనగానే పూజారిణి కళ్ళెర్రచేసి, శూలం ఎత్తి అతడి కేసి వెళ్ళబోయింది. ఖడ్గవర్మ వెంటనే, "ఆగు, పూజారిణీ! నా హెచ్చరిక గుర్తుందా? కదిలావంటే నీ కంఠంలో యీ బాణం వచ్చి గుచ్చుకుంటుంది. కదలకుండా అక్కడే నిలబడి నీ మంత్రశక్తితో, నీ శత్రువులను హతమార్చు. మా అభ్యంతరం ఏమీలేదు," అన్నాడు.

అప్పటివరకూ జరుగుతున్నదంతా కన్నార్పకుండా చూస్తున్న వృద్ధ పూజారి పెద్దగా గొంతెత్తి, "ఇప్పుడా గురుద్రోహిణికి ఎలాంటి మంత్రశక్తులూ లేవు. లోగడ నేను దాని కిచ్చిన మంత్ర బలాన్నంతా ఉప సంహరించేశాను," అన్నాడు.

"అబద్ధం. ఈ ముసలివెధవ మాటలు నమ్మకండిరా, శిష్యుల్లారా! చూడండి, యిప్పుడే వాణ్ణి నా శూలానికి గుచ్చి పైకెత్తు

తాను," అంటూ పూజారిణి అరిచి, వృద్ధ పూజారి కేసి కదిలింది.

"ఆగు!" అంటూ ఖడ్గవర్మ బాణాన్ని ఆమె శూలం పట్టుకున్న చేతికి గురిచేసి కొట్టాడు. పూజారిణి "అబ్బా!" అంటూ బాధతో ఒక్కసారి కేక పెట్టింది. శూలం ఆమె చేతినుంచి జారి కిందబడిపోయింది.

"పూజారిణీ, నువ్వు నా హెచ్చరికలను పాటించనందున, తప్పనిసరై బాణం నీమీద ప్రయోగించవలసి వచ్చింది. ఇకనైనా జాగ్రత్త!" అన్నాడు ఖడ్గవర్మ.

శూలం పూజారిణి చేతి నుంచి జారి పడటం చూస్తూనే, ఆమె శిష్యుల్లో యిద్దరు ఎగిరి గంతులేస్తూ, "మహా పవిత్రమైన త్రిశూలాన్ని నేలకు జార్చి పూజారిణి దాన్ని అపవిత్ర పరిచింది. ఇక మా గురువు వృద్ధ పూజారే!" అంటూ కేకలు ప్రారంభించారు.

"ఖడ్గా, మనం దారితప్పి ఎలాంటి మందమతుల మధ్యకు వచ్చి పడ్డాం. ఈ పాడుబడ్డ నగరంలో వీళ్ళంతా పడివుండటమే అందరికీ మేలు. వీళ్ళు యిక్కణ్ణించి బయిటికి వచ్చి మామూలు జనంలో కలిశారో, వాళ్ళూ బుద్ధిహీనులైపోతారు," అన్నాడు జీవదత్తుడు.

తన పక్షానికి యిద్దరు పూజారిణి శిష్యులు రాగానే వృద్ధపూజారి పరమానందంచెంది, "ఆహాహాఁ, మహాభూతా! ఎన్నాళ్ళ



కెన్నాళ్ళకు నా శిష్యగణం సత్యం తెలుసుకుని, అంధకారం నుంచి వెలుగులోకి వచ్చేలా చేశావు! ఇక నీకు గతకాలంలో లాగే ప్రాణులబలిని యితోధికంగా చేస్తాను!" అన్నాడు.

"ఖడ్గా, ఈ ముసలిపీనుగా క్రౌర్యంలో పూజారిణికి ఏ మాత్రం తీసిపోయేవాడిలా లేడు," అని జీవదత్తుడు అక్కడ చేరిన వాళ్ళందరినీ ఉద్దేశించి, "మీ నాయకత్వపు తగాదాల్లో మేము ఎవరిపక్షానా కల్పించుకోబోవటం లేదు. మీలో ఎవరైనా ఒకరు మా వెంట వచ్చి, యీ శిథిలగరాన్నుంచి బయట వున్న అరణ్యంలోకి పోయేమార్గం చూపండి!" అన్నాడు.



"మీరు యిక్కడ నుంచి పారిపోయేందుకు మార్గం చూపటమా? ఎలాంటి కోరిక! ఆగండి, యిప్పుడే మిమ్మల్నిద్దర్నీ నా శూలానికి గుచ్చి, మహాభూతం ముందు పడవేయబోతున్నాను," అంటూ పూజారిణి వంగి కింద పడివున్న శూలాన్ని చేతిలోకి తీసుకోబోయింది.

"ఒకసారి అనుభవం అయినా, యీ బుద్ధిహీనురాలికి జ్ఞానోదయం అయినట్టులేదు," అంటూ ఖడ్గవర్మ మరొక బాణాన్ని పూజారిణి చేతికేసి గురిచేసి వదలబోయేంతలో జీవదత్తుడు అతడి చేయిపట్టుకుని వారించాడు.

"ఖడ్గా, ఎంత దుర్మార్గురాలైనా ఆడదాన్ని హింసించటం, చంపటం మనం చేయరానిపనుల్లో ఒకటి. ఆ వృద్ధ పూజారినీ, ఆవిణ్ణీ యీ శిధిలగనర సామ్రాజ్యం కోసం ఒకరి గొంతు లొకరు కోసుకోనీ, మనకెందుకు?" అని జీవదత్తుడు దండం పైకెత్తి, మాంత్రికుణ్ణీ, జడలభూతాన్నీ సమీపించి, "మీ యిద్దరూ ముందు కదిలి అరణ్యం వైపుకు వున్న ఆ గుహామార్గం కేసి బయలుదేరండి. ఊఁ, కదలండి!" అన్నాడు తీవ్రస్వరంతో.

మాంత్రికుడు వృద్ధపూజారికీ, పూజారిణికీ చేతులెత్తి నమస్కరిస్తూ, "గురువుల్లారా! ఏదో శాపకారణంగా గత ఇరవై నాలుగ్గంటల నుంచీ నా మంత్రశక్తులు పని చేయటం లేదు. ఈ మానవ మాత్రులకు లొంగిపోయి వాళ్ళకు దారి చూపమంటారా, లేక మీ మంత్ర బలంలో నన్ను కాపాడతారా?" అని అడిగాడు.

వృద్ధ పూజారీ, పూజారిణీ ముఖముఖాలు చూసుకుని మాటాపలుకూ లేకుండా మూగవాళ్ళల్లా తలలు పక్కకు తిప్పుకుని వూరుకున్నారు.

ఖడ్గవర్మ ఓ తృటికాలం వాళ్ళకేసి చూసి, ఒరలో నుంచి కత్తిదూసి, మాంత్రికుణ్ణీ, జడలభూతాన్నీ అదిలిస్తూ, "ఇక యీ చచ్చు కబుర్లూ, హాస్య నాటకం కట్టిపెట్టి నడవండి, ఆ గుహ ఎక్కడున్నదో చూపండి," అన్నాడు కోపంగా.

కత్తి చూస్తూనే మాంత్రికుడూ, జడల భూతం అదిరిపడి, "మహాసత్వ శేఖరుల్లారా. మమ్మల్ని చంపకండి! ఇదుగో, మీరు అరణ్యం చేరే గుహాసారంగం చూపుతాము, దయచేయండి!" అంటూ బయలుదేరారు.

ఆ ఇద్దరూ, కొంచెం ఎడంగా ఖడ్గ జీవ దత్తులూ బయలుదేరి కొద్ది దూరం వెళ్ళే లోపలే, వెనక వృద్ధ పూజారి పక్షం వాళ్ళూ, పూజారిణి పక్షం వాళ్ళూ పెద్ద రణగొణ ధ్వనిగా అరుస్తూ కలబడి కొట్టుకోసాగారు. జీవదత్తుడు తల తిప్పి వాళ్ళకేసి ఓసారి చూసి నవ్వుతూ, "ఖడ్గా, మహాభూతానికి ఎవరు ప్రధాన పూజారి కావాలన్న సంగతి తేల్చబోయి. ఈ దొంగ మాంత్రికులూ, శిష్యగణం చచ్చేలావున్నారు," అన్నాడు.

"చచ్చువెధవ లందర్నీ. చావనీ! ఈ శిధిలాల్లో చిక్కివున్న ఆ సింహానికైనా కొంతకాలం పాటు ఆకలితో డొక్కమాడే అవస్థ తప్పుతుంది," అన్నాడు ఖడ్గవర్మ.

ఆ మాటలు వింటూనే జడలభూతం నిలువెల్లా వణికిపోతూ, మాంత్రికుడితో, "గురో, ఆ పొగరుబోతు సింహం మనం వెళ్ళే గుహలో ఎక్కడైనా పొంచివుండి మీద పడితే ఏం చేయాలి?" అన్నాడు.

"విరుచుకు తిను! ఊం, పిరికివెధవా, ఆర్చేవాగక పద," అన్నాడు ఖడ్గవర్మ కత్తి ఝుళిపిస్తూ.



"భయపడకురా, శిష్యా! ఆ సింహం గుహలో కనబడాలేగాని, దాన్ని నా మంత్ర శక్తితో క్షణాలమీద పిల్లిగా మార్చుతాను. ఎందుకైనా మంచిది. యిదుగో గుహామార్గం దగ్గరకొచ్చాం. మహాభూతాన్ని తలుచుకుని నువ్వే ముందు గుహలో ప్రవేశించు," అన్నాడు మాంత్రికుడు.

ఆ గురుశిష్యుల వెంట ఖడ్గజీవదత్తులు గడిచిన రాత్రి శిధిలనగరంలోకి ప్రవేశించిన సారంగం వెంటపోయి, అరణ్యం కేసివున్న గుహద్వారాన్ని చేరారు. తరవాత వాళ్ళు ఆ గుహనుంచి కిందికి దిగి, చుట్టూ ఓమారు కలయచూసి. మాంత్రికుడూ, జడలభూతా లతో, "ఇక మీరు మీ శిధిలభవనాలకు

తిరిగిపోయి, మహాభూతాన్ని భక్తితో ఆరాధిస్తూ తరించండి!" అన్నారు అవహేళనగా.

మాంత్రికుడు, ఖడ్గజీవదత్తులకు నమస్కరించి, "మహాసత్వుల్లారా! ఇక మేము ఆ శిథిలనగరానికి పోము. ఇక్కణ్ణించి ఆ కనబడే దూరపుకొండలకుపోయి, అక్కడ ఏదో విధంగా జీవయాత్ర సాగిస్తాము," అన్నాడు.

"ఆ సాగించబోయే జీవయాత్రలో దాష్టీ కొట్టటం మాత్రం చేయకండి. చిక్కుల్లో పడిపోతారు. ఆ దూరపు కొండల్ని చేరే లోపల ఖడ్గజాతి వాళ్లెవరి కంటా పడకుండా జాగ్రత్త పడండి. వాళ్ళు మీ మీద పగబట్టి వున్నారు," అన్నాడు జీవదత్తుడు.

మాంత్రికుడూ, జడలభూతం వెళ్ళిపోగానే, ఖడ్గ జీవదత్తులు నదికి పోయి హాయిగా స్నానం చేసి, దాపుల నున్న అరణ్యంలోకి వెళ్ళి పళ్లూ ఫలాలూ కోసుకు తిని, ఒక చెట్టు కింద ఒక గంటకాలం విశ్రమించి, నది దిగువకు బయలు దేరారు. స్వర్ణాచారిని పట్టుకు పోయిన బందిపోట్లు ఆ ప్రాంతాల ఎక్కడో వుంటారన్న నమ్మకం వాళ్ళకు కలిగింది. ఎలాగైనా స్వర్ణాచారిని బందిపోట్ల నుంచి కాపాడి తీరాలని వాళ్ళు నిశ్చయించుకున్నారు.

ఖడ్గ జీవదత్తులు ఒక గంటకాలం ప్రయాణించే సరికి, వాళ్ళకు నదీ తీరం వెంట కొన్ని చిన్నా పెద్ద కొండలు కంటబడినై. ఆ కొండల్లో ఒక దాని మీద ఒంటెల చేత, కొందరు మనుషులు పెద్ద పెద్ద బండ రాళ్ళను లాగించుకు పోతున్నారు.

"ఖడ్గా, వీళ్ళు బందిపోటు ముఠా అయి వుంటారు. ఇసుక ఎడారుల్లో, మైదానాల్లో తిరిగే ఒంటెలను, కొండల పైకి ఎక్కించి, వాటిచేత రాళ్ళు లాగించటం ఎంత ప్రమాదమో వాళ్ళకు తెలిసినట్టు లేదు," అన్నాడు జీవదత్తుడు.

జీవదత్తుడు మాట ముగించే లోపలే ఒక ఒంటె, దాని నెక్కి వున్న మనిషితో సహా కొండ అంచు నుంచి జారి తలకిందులుగా దిగువ నున్న పల్లంలోకి పడిపోయింది.

—(ఇంకా వుంది)






# పితృధర్మం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నువు ఈ వేళ కానివేళ ఇలా శ్రమపడటానికి కారణం స్వార్థమో, పరార్థమో తెలియదు. కాని కొందరిని ప్రేరేపించేది స్వార్థమో, పరార్థమో నిర్ణయించటం సాధ్యం కాదు. ఇందుకు నిదర్శనంగా నీకు రామశాస్త్రి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం ఒక గ్రామంలో పార్వతీపతి అని ఒక గొప్ప విద్వాంసు డుండేవాడు. పండిత ప్రపంచంలో ఆయనకు గొప్ప పేరుండేది. ఈ సంగతి తెలిసి ఆ దేశపు రాజు ఆయనకు ఒక అగ్రహారం కూడా బహూకరించాడు.

## బేతాళ కథలు



ధనానికీ, ప్రతిష్ఠకూ లోటు లేకపోయి నప్పటికీ పార్వతీపతికి సంతానం లేని లోటు అమితంగా బాధ కలిగించింది. ఎన్నో పూజలూ, నోములూ చేసిన మీదట అయ నకు ఒక కొడుకు కలిగాడు. ఆ కుర్రవాడికి రామశాస్త్రి అని పేరు పెట్టుకున్నారు.

కొడుకు తనను మించిపోవాలని ఏ తండ్రి కైనా ఉంటుంది. పార్వతీపతి అలాగే తన కొడుకు ఉద్దండపండితుడైపోయి, తన కన్న గొప్ప కీర్తి ప్రతిష్ఠలు సంపాదించాలని ఎన్నో కలలు కన్నాడు. కాని ఆయన కలలు ఫలించలేదు.

రామశాస్త్రి అన్నివిధాలా మంచివాడే. అతనికి తండ్రి మీద ఎంతో భక్తీ, ప్రేమా, అభిమానమూ ఉండేవి. కాని అతనికి విద్య అబ్బలేదు. చదివినది వెంటనే మరిచిపోయే వాడు. అతని మెదడు మొద్దుబారిపోయి నట్టు ఉండేది. అతను పుట్టుజడుడు.

పార్వతీపతి తన కొడుకును చూసి చాలా బాధపడ్డాడు. రామశాస్త్రి ఆకతాయి అయి ఉంటే, తండ్రి అతన్ని శిక్షించి క్రమమైన మార్గంలో పెట్టటానికి ఉండేది. కాని రామశాస్త్రి ఎంతో శ్రమపడి అధ్య యనం చేసి కూడా ఏమీ ప్రయోజనం లేకపోయింది. చదువు వంటబట్టకుండానే రామశాస్త్రి పెరిగి, పెద్దవాడయాడు.

ఇలా ఉండగా, ఒకనాడు, పార్వతీపతి చిన్ననాటి స్నేహితుడైన చంద్రభట్టు పార్వతీపతిని చూడవచ్చాడు. ఈ చంద్ర భట్టు పొరుగుదేశపు ఆస్థాన విద్వాంసుడు. ఆయన వచ్చేసరికి పార్వతీపతి ఇంటలేడు, పనిమీద పక్క ఊరు వెళ్ళాడు. రామశాస్త్రి ఆయనను పలకరించాడు.

"నువు పార్వతీపతి కొడుకువు కాదు, బాబూ?" అని చంద్రభట్టు అడిగాడు. రామశాస్త్రి అవునన్నాడు.

చంద్రభట్టు రామశాస్త్రితో ఏదో పండిత ప్రసంగం ప్రారంభించి, త్వరలోనే ఆ కుర్ర వాడు శుంఠ అని తెలుసుకున్నాడు.

ఇంతలో పార్వతీపతి ఇల్లు చేరుకుని, చాలాకాలానికి కనిపించిన చంద్రభట్టుతో

కుశలప్రశ్నలు చేశాడు. చిన్ననాటి ముచ్చట్లు ముగిసినాక చంద్రభట్టు, "పార్వతీపతీ, నేను ఆస్థానపండితుడి పదవి నుంచి విరమించుకుందామనుకుంటున్నాను," అన్నాడు.

పార్వతీపతి ఆశ్చర్యంగా, "అదేం?" అని అడిగాడు.

"నన్ను మించిన పండితుడుండగా నేనా పదవిలో ఉండటం భావ్యం కాదు గద!" అన్నాడు చంద్రభట్టు.

"నిన్ను మించిన పండితుడా? ఎవరది?" అని పార్వతీపతి అడిగాడు.

"ఇంకెవరు? నా కొడుకే!" అన్నాడు చంద్రభట్టు గర్వంగా.

ఈ మాట వింటూనే పార్వతీపతి కుంగిపోయి, తల వంచుకున్నాడు.

రామశాస్త్రి శుంఠ అని అంతకుముందే తెలుసుకున్న చంద్రభట్టు పార్వతీపతి బాధ అర్థంచేసుకుని, సానుభూతితో, "సరే కాని, నీకు లేకలేక కలిగినందుకు నీ కొడుకును గారాబంతో పాడు చేసినట్టున్నావు?" అన్నాడు.

దానికి పార్వతీపతి ఏమీ జవాబు చెప్పలేక ఒక నిట్టూర్పు విడిచి మెదలకుండా ఊరుకున్నాడు.

ఆ రాత్రి ఆయన భోజనం చేస్తూ తన భార్యతో, "ఇలాటి కొడుకు పుట్టటం ఎంత



అవమానం! ఛీ, ఛీ! వీడు పుట్టకపోయినా బాగుండిపోయేది. తల్లిదండ్రులకు అపకీర్తీ, అవమానమూ తెచ్చే సంతానం ఉంటేనేం, లేకుంటేనేం? బతికినంతకాలం యీ బాధ తప్పదు" అని వ్యథపడ్డాడు.

అవతలి నుండి రామశాస్త్రి ఈ మాటలు విని ఎంతో కుమిలిపోయాడు. అతనికి తండ్రి అంటే చాలా అభిమానమూ, ప్రేమా ఉన్నాయి. ఆయన తనను గురించి ఇలా అనుకోవటం అతనికి భరించరాని బాధ కలిగించింది. తాను మహాపండితుడుగా అయిన తరవాతనే ఇంటికి తిరిగి వస్తాననుకుని రామశాస్త్రి ఆ రాత్రే ఇల్లు వదిలి వెళ్ళిపోయాడు.



కాని తాను పండితుడు కావటం ఎలాగో అతనికి అంతు చిక్కలేదు. సరస్వతీ కటాక్షం తప్ప అతనికి మరోమార్గం కనిపించక, దీక్షగా సరస్వతిని గురించి తీవ్ర తపస్సు చేశాడు.

కొంతకాలానికి రామశాస్త్రి తపస్సు ఫలించి, సరస్వతి సాక్షాత్కరించి, "వత్సా, నువు మహాపండితుడివి కా గోరుతున్నావు. కాని నువు ఇలాగే మూఢుడివిగా ఉండి పోయినట్టయితే నీ కొడుకులు సాటిలేని పండితులవుతారు. అలాకాక, నువు మహా పండితుడివి కా గోరితే నీకు పుట్టే కొడుకులు మూర్ఖులూ, దుష్టులూ అవుతారు. నువు ఏది కోరుకుంటావు?" అని అడిగింది.

రామశాస్త్రి ఈ మాటలు విని తెల్లబోయి, కొంతసేపు ఏమీ చెప్పలేక, చివరకు, "నేను మహాపండితుణ్ణే అవుతాను," అన్నాడు.

"తథాస్తు!" అని సరస్వతీదేవి అదృశ్య మయింది.

సరస్వతీ కటాక్షంవల్ల రామశాస్త్రి సకల విద్యాపారంగతుడయాడు. అతను దారిలో కనిపించిన పండితులనందరినీ ఓడిస్తూ, రాజుల నుంచి సత్కారాలు పొందుతూ, ఇల్లు చేరుకున్నాడు.

శుంఠగా ఇల్లు విడిచి పోయిన తన కొడుకు మహాపండితుడై, కీర్తి ప్రతిష్ఠలు సంపాదించి తిరిగి వచ్చినందుకు పార్వతీ పతి పరమానందం చెందాడు. ఆ సంతోషం ఆయనకు జీవితాంతం వరకూ దక్కింది.

ఇంటికి తిరిగివచ్చిన కొంతకాలానికి రామశాస్త్రికి వివాహం అయింది. కాల క్రమాన అతనికి ఒక కొడుకు పుట్టాడు. ఆ కొడుకు ఎదిగివస్తున్నకొద్దీ సరస్వతిదేవి చెప్పిన మాట రుజువు కాసాగింది. ఈ కుర్ర వాడు మూఢుడూ, దుష్టుడూనూ. వాడి మూలంగా రామశాస్త్రి అవమానం పొంద టమేగాక, లోకుల శాపనార్థాలకు కూడా గురి కావలిసి వచ్చింది. తన కొడుకు ఇలా కావటానికి తానే గదా కారణం అనుకుని రామశాస్త్రి కుంగిపోయాడు.

పరిస్థితి నానాటికీ విషమించటం చూసి రామశాస్త్రి మరొకసారి సరస్వతీదేవిని ధ్యానించి, ఆమెను ప్రత్యక్షం చేసుకుని, "తల్లీ, నా కొడుకు బాగుపడే మార్గం లేదా?" అని అడిగాడు.

"నువు నీ పుణ్యాన్నీ, మంచితనాన్నీ, పాండిత్యాన్నీ వాడికి ధారపోస్తే నీ కొడుకు పూర్తిగా మారిపోతాడు," అని సరస్వతి మాయమయింది.

రామశాస్త్రి అలాగే చేశాడు. అతని కొడుకు మహాసజ్జనుడూ, ఉద్దండపండితుడూ అయిపోయి, అఖండ ఖ్యాతి తెచ్చుకున్నాడు.

రామశాస్త్రి తిరిగి శుంఠ అయిపోవటమే గాక దుష్టుడన్న అపఖ్యాతి కూడా సంపాదించుకున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, రామశాస్త్రిది స్వార్థమనాలా? త్యాగమనాలా? అతనికి కావలిసినది తన కొడుకు మహా పండితుడు కావటమే అయితే అతను శుంఠగా ఉండిపోతే సరిపోయేది కదా? అలా కాక, తన కొడుకు మూఢుడూ, దుష్టుడూ అవుతాడని ముందే తెలిసి కూడా తాను మహాపండితుడు ఎందుకయాడు? అతని ప్రవర్తనలో ఈ వైరుధ్యానికి అర్థం ఏమిటి? దీనికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రామశాస్త్రి తన తండ్రిపట్ల తన ధర్మం నిర్వర్తించటానికిగాను మహాపండితుడయాడు. కాని తన కొడుకుపట్ల తన ధర్మం నిర్వర్తించటానికి తిరిగి శుంఠ కావటమేగాక దుష్టుడు కూడా కావలిసి వచ్చింది. ఈ వైరుధ్యం అతని ధర్మాలలో స్వతస్సిద్ధంగా ఉన్నదే. అదే అతని ప్రవర్తనలో బయటపడింది. రామశాస్త్రి తన పుత్ర ధర్మాన్నీ, పితృ ధర్మాన్నీ కూడా చక్కగా నిర్వర్తించాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)



# గేదె కొమ్ముల సమస్య

పరమానందయ్యగారు ఇద్దరు శిష్యులతో వంచారం చేస్తూ ఒక తోపులో చేరి వంట ప్రారంభించి, ఎవరినన్నా అడిగి ఇంత మజ్జిగ తెమ్మని ఒక శిష్యుణ్ణి పంపాడు.

వాడు ఒక రైతు ఇంటికి వెళ్ళి అక్కడ కనిపించిన మునలావిడను మజ్జిగ అడిగాడు. ఆమె నరే నన్నది. ఇంతలో శిష్యుడి కళ్ళు ఒక గేదె మీద పడ్డాయి. వాడు ఆమెతో, "ఏమమ్మా, ఈ గేదె కొమ్ములు ఇంత పెద్దవి గదా, వాకిలి చూడబోదే చిన్నదిగా ఉన్నది. గేదె చస్తే ఎలా బయటికి చేరవేస్తారు?" అన్నాడు.

మునలావిడకు మండి, వాణ్ణి తిట్టి వెళ్ళగొట్టింది.

మొదటి శిష్యుడు ఎంతకూ రాకపోయేసరికి పరమానందయ్య తన రెండో శిష్యుణ్ణి పంపాడు. వాడు కూడా ఆ ఇంటికే వచ్చి, మునలావిడను మజ్జిగ అడిగాడు. మునలావిడ ఇంతకు ముందు వచ్చిన వాడన్న మాటలు రెండో వాడితో చెప్పింది.

రెండో శిష్యుడు నవ్వి, "వాడు మందమతి లేవమ్మా! గేదె చస్తే కొమ్ములు నరికి అయినా బయటికి ఈడ్చిపారేస్తారు గాని ఇంట్లో ఉంచుకుంటారా ఏం?" అన్నాడు.

మునలావిడ వాణ్ణి కూడా తిట్టి, వెళ్ళగొట్టింది. —జె. నాగేశ్వరావు





# జందెం బరువు

ఒక వూళ్ళో అతి పేద బ్రాహ్మడు ఒకడు ఉండేవాడు. అతనికి ఏ విద్యలూ రావు. అయితే ధనం పుష్కలంగా సంపాదించాలన్న అభిలాష మటుకు బాగా ఉండేది.

ఒకనాడు ఆ బ్రాహ్మడు మరొక గ్రామానికి వెళ్ళగా, అక్కడ ఒక ఇంటి అరుగు మీద ఒక ముసలి బ్రాహ్మడు కనిపించాడు. ఆయన ఆ అరుగు మీద కూర్చుని యజ్ఞోపవీతాలు తూచి అమ్ముతున్నాడు. ఆయన త్రాసు పట్టుకుని, ఒకపక్క పళ్ళెంలో జందెం వేసి, రెండో పళ్ళెంలో కొనేవాళ్ళను డబ్బులు వెయ్యమంటాడు. కొందరు రాగి డబ్బులు వేస్తారు, కొందరు వెండివి కూడా వేస్తారు. కాని వాళ్ళు వేసే డబ్బుల బరువుకూ, యజ్ఞోపవీతం బరువుకూ ఏమీ సంబంధం ఉండేదికాదు. ఇది చూసి పేద బ్రాహ్మడు చాలా ఆశ్చర్యపడి, బ్రాహ్మడి వద్దకు వెళ్ళి, "అయ్యా, నేను చాలా బీదవాణ్ణి. నాకొక జందెం దానం చేస్తారా?" అని అడిగాడు.

"అలాగే," అని ముసలి బ్రాహ్మడు పేద బ్రాహ్మడికి ఒక జందెం ఇచ్చాడు.

తరవాత ఆ పేద బ్రాహ్మడు ఆ దేశపు రాజుగారి వద్దకు వెళ్ళి, "మహారాజా, నా వద్ద ఒక అపూర్వమైన జందెం ఉన్నది. దాన్ని తమరు తీసుకుని దాని ఎత్తు బంగారం ఇప్పించండి," అన్నాడు.

రాజు సరేనన్నాడు. మంత్రి ఒక త్రాసు తెప్పించి దానిలో ఒకపక్క పేద బ్రాహ్మడి జందెం వేసి, రెండోపక్క కొంచెం బంగారం పెట్టాడు. జందెమే బరువుగా ఉన్నది. మంత్రి మరి కొంచెం బంగారం వేశాడు. ఇంకా జందెమే బరువుగా ఉన్నది. మంత్రి కొంచెం కొంచెంగా బంగారం పెంచుతూ వచ్చాడు. కాని, ఎంత బంగారం వేసినా, జందెం బరువే హెచ్చుగా ఉన్నది.

సి. నాగరాజు

రాజూ, మంత్రీ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. మంత్రికి ఒక ఆలోచన వచ్చింది. ఆయన పేద బ్రాహ్మడితో, "బ్రాహ్మడా, జందెం తూకం తరవాత చూదాం. నీ భోజనానికి వేళ కాబోతున్నది. వంట చేయిస్తాను," అని మనిషిని పంపి బియ్యం తెప్పించి, బ్రాహ్మడు చూస్తూ ఉండగా, జందెం బరువుకు సమంగా బియ్యం తూయించాడు. పావు సేరు బియ్యానికి జందెం సమంగా తూగింది. ఆ బియ్యాన్ని వండించి బ్రాహ్మడికి భోజనం పెట్టిస్తే బ్రాహ్మడి కడుపు సమంగా నిండింది.

అప్పుడు మంత్రి రాజుతో రహస్యంగా, "నేను అనుమానించినంతా అయింది. ఈ బ్రాహ్మడు తెచ్చిన జందెంలో ఒక విచిత్రమైన గుణం ఉన్నది. దాని బరువు బ్రాహ్మడి సంతృప్తిపైన ఆధారపడి ఉన్నది. అతను తినగలిగినది పావుసేరు బియ్యం. అందుచేత జందెం సరిగా పావుసేరు బియ్యానికి సమంగా తూగింది. అదే బంగారమైతే, ఆ బ్రాహ్మడు ఎంతకీ తృప్తి చెందడు. ఎంత బంగారం వేసినా జందెం బరువే హెచ్చుగా ఉంటుంది," అన్నాడు.

"అయితే మరి మనం ఏం చేద్దాం? జందెం ఎత్తు బంగారం ఇస్తామన్నాం కదా?" అన్నాడు రాజు.

"అది నాకువదలండి," అన్నాడు మంత్రి.

బ్రాహ్మడు భుక్తాయాసం తీర్చుకుని మంత్రితో, "నాకు జందెం ఎత్తు బంగారం ఇచ్చి పంపెయ్యండి," అన్నాడు.

"నీకు బంగారం ఇప్పిస్తాను. కాని దాన్ని నువు మోసుకుపోలేకపోతే ఆ బంగారం నీకు దక్కదు. ఒకవేళ మోసుకుపోయినా దాన్ని నువు దొంగల బారినుండి కాపాడు కోలేవు. నీ జందెం బరువు పావుసేరు బియ్యం ఎత్తన్నది చూశావుగద. రోజూ దివాణంలో భోజనంచేసి పోతావా? లేక బంగారం పట్టుకుపోతావా? అన్నాడు మంత్రి.

తన జందెం పావుసేరు బంగారం బరువు ఉంటుంది కాబోలు ననుకుని బ్రాహ్మడు, "నాకు రోజూ భోజనమే పెట్టించండి," అన్నాడు.





# మాటకు మాట

ఒక రాజుకు అమితమాటకారి అయిన కూతురు ఉండేది. ఆమెతో మాట్లాడటం ఎవరికీ సాధ్యమయేది కాదు. అందుచేత రాజు, తన కుమార్తెను మాటకారి తనంలో జయించిన వాడికి ఆమె నిచ్చి పెళ్ళి చెయ్యటమేగాక, అర్థరాజ్యం కూడా ఇస్తానని ప్రకటన చేశాడు.

అర్థరాజ్యం కట్నంతో వస్తున్న రాజకుమార్తెను పెళ్ళాడటానికి అడ్డమైన వాళ్ళూ ముందుకు వచ్చారు. అయినా ఎవరూ రాజకుమార్తెతో మాటకుమాట అనలేకపోయారు.

చివరకు రాజు విసిగి, రాజకుమార్తెతో ఓడిపోయిన వారి చెవులకు కర్రులు కాల్చి వాతలు వేయిస్తానన్నాడు.

రాజకుమార్తె పెళ్ళి వార్త విని ముగ్గురు అన్నదమ్ములు బయలుదేరారు. వాళ్ళకు జరుగుబాటు తక్కువగా ఉండటం చేత అర్థరాజ్యం సంపాదించుకుంటే బాగుంటుందని తోచింది. వాళ్ళు వచ్చేదారిలో ఒక చచ్చిన గోరింక కనిపించింది. మూడో వాడు దాన్ని తీసుకుని, "నాకేం దొరికిందో చూడండి." అని అన్నలతో అన్నాడు.

"అది ఎందుకురా? పారెయ్యి అవతల!" అన్నారు అన్నలు.

"ఎందుకైనా పనికి రావచ్చు." అంటూ మూడోవాడు దాన్ని దాచుకున్నాడు.

మరి కొంతదూరం వెళ్ళాక వాడికి ఒక నారతడప దొరికింది. అన్నలు పారెయ్యమంటే వినక వాడు దాన్ని కూడా దాచుకున్నాడు.

ఇలా వాడికి దారిలో వరసగా ఒక కుండ పెంకూ, రెండు పాటేలు కొమ్ములూ, ఒక కొయ్యమేకూ, ఒక పాత చెప్పూ దొరికాయి.

ముందు పెద్దవాడు రాజకుమార్తెతో మాట్లాడబోయి, "సుదినం! ఇక్కడ చాలా వేడిగా ఉన్నదే!" అన్నాడు.

నార్వే జానపద కథ

"అందులో ఇంకా వేడిగా ఉంటుంది." అంటూ రాజకుమార్తె సమీపంలో ఉన్న కొలిమిని చూపింది. ఆ కొలిమిలో రెండు ఇనపకడ్రులు ఎర్రగా కాలి ఉన్నాయి. వాటిని చూడగానే పెద్దవాడికి నోట మాట రాలేదు. రెండు చెవులకూ వాతలు వేయించుకుని బయటికి వెళ్ళాడు.

రెండోవాడి గతి కూడా అంతే అయింది.

తరవాత మూడోవాడు వచ్చి, "సుదినం! ఇక్కడ చక్కగా వెచ్చగా ఉన్నది." అన్నాడు. రాజకుమార్తె కొలిమి చూపించి, "అది చాలా వేడి!" అన్నది.

"అందులో ఈ గోరింకను కాల్చుకోవచ్చు," అన్నాడు వాడు.

"ముక్కలై రాలిపోతుంది." అన్నది రాజకుమార్తె.

"ఈ తడపతో కట్టితే సరి," అన్నాడు వాడు.

"చాలా వదులవుతుంది," అన్నది రాజకుమార్తె.

"ఈ కొయ్య శీల దూర్చితేసరి!" అన్నాడు వాడు.

"కొవ్వు కారిపోతుంది," అన్నది రాజకుమార్తె.

"ఈ కుండ పెంకు అడ్డం పెడతాను," అన్నాడు వాడు.

"ప్రతి మాటకూ ఏదో మెలిక పెడతావే!" అన్నది రాజకుమార్తె.

"మెలిక నా మాటలకు కాదు, దీనికి చూడు!" అంటూ వాడు ఒక పొటేలు కొమ్ము పైకి తీశాడు.

"ఇదెక్కడా ఎరగం!" అన్నదామె.

"అలాటిది ఇంకోటి కూడా ఉన్నది." అంటూ వాడు రెండో కొమ్ము పైకి తీశాడు.

"నన్ను జయించటానికి మహా నలిగిపోతున్నావు," అన్నది రాజకుమార్తె.

"నలిగి అరిగి పోయేది నేను కాదు, ఈ చెప్పు!" అన్నాడు వాడు.

ఆ తరవాత ఏమనాలో రాజకుమార్తెకు తోచలేదు. ఆమె ఓడిపోయినట్టు ఒప్పుకుని మూడోవాణ్ణి పెళ్ళిచేసుకున్నది. వరకట్నం కింద వాడు అర్ధరాజ్యం సంపాదించుకున్నాడు.





# కష్టమైన విద్య

పూర్వం ఒక రాజు ఆస్థానంలో సమస్త శాస్త్రాలూ తెలిసిన మహా పండితుడు ఒకడు ఉండేవాడు.

ఒకసారి రాజసభలో, విద్యలన్నిటిలోకీ కష్టసాధ్యమైనది ఏది అన్న విషయమై చర్చ జరిగింది. ఎవరికి తోచిన విద్య గురించి వారు చెప్పారు. ఆస్థానపండితుడు మటుకు, "అన్నిటిలోకీ కష్టసాధ్యమైనది చోరవిద్య," అన్నాడు.

ఈ మాట విని రాజుకు కోపం వచ్చింది.

"అది ఎలా? ఇంకే విద్యా సాధించ లేని పనికిమాలిన వాళ్ళే దొంగతనాలకు దిగుతారు. దొంగలలో ప్రతిభావంతులుండటం మనం చూడం," అన్నాడు రాజు.

"మహారాజా, ఏ విషయమైనా అనుభవంలోనే కదా రుజువు కావాలి? మీరు ఎంత విలువలేని వస్తువైనా ఇతరులది దొంగిలించటానికి ప్రయత్నించండి; అప్పుడు తెలిసి వస్తుంది చోరవిద్య ఎంత కష్టమో!" అన్నాడు పండితుడు.

అందుకు రాజు ఒప్పుకున్నాడు.

"తమరు అసలు వేషంలో వెళ్ళినట్టయితే ఎవరైనా, ఎంత ధనమైనా సంతోషంగా సమర్పిస్తారు. నిజమైన దొంగ తనను ఎవరూ గుర్తు పట్టటానికి వీలులేని వేషంలో, ఇతరులకు తెలియకుండా, వీలయినంత వరకు వారికి పట్టుబడకుండా, వారి సొత్తు సంగ్రహిస్తాడు. మీరు కూడా అదే పద్ధతిలో దొంగతనం చెయ్యాలి," అన్నాడు ఆస్థాన పండితుడు.

రాజు ఇందుకు సమ్మతించాడు. ఆయన తన ముఖానికి ఇంత బొగ్గు పులుముకుని, నల్ల బట్టలు ధరించి, చూడటానికి సిసలైన దొంగలాగా తయారై, చీకటి రాత్రివేళ దొంగతనానికి బయలుదేరి, ధనికులుండే ఇళ్ళుండే ప్రాంతానికి వెళ్ళాడు. అయితే

ఎ. రవికిశోర్

అలాటి ఇళ్ళలో ప్రవేశించటం రాజుకు సాధ్యం కాలేదు. కొన్ని ఇళ్ళకు బలమైన కవాటాలు బిగించి ఉన్నాయి. మరికొన్ని ఇళ్ళ ముందు కాపలా వాళ్ళు ఉన్నారు. అన్ని ఇళ్ళకూ ఎత్తయిన ప్రహరీగోడలు న్నాయి అలాటి ఇళ్ళలోకి ప్రవేశించటం తనకు సాధ్యం కాదని రాజు తెలుసు కున్నాడు.

ఆస్థానపండితుడు తనను పెద్ద దొంగ తనం చెయ్యమనలేదు; ఎంత చిన్న వస్తువు దొంగిలించినా తన అభిప్రాయాన్ని మార్చు కుంటానని ఆయన అన్నాడు. అందుచేత రాజు ధనికుల ఇళ్ళు విడిచిపెట్టి సాదాజను లుండే ప్రాంతానికి వెళ్ళాడు. అక్కడ ఇళ్ళ ద్వారాలు కూడా బంధించే ఉన్నాయి.

కాని ఒక కుమ్మరి ఇంటి ముందు కుండల దొంతర్లు చాలా ఎత్తుగా పేర్చి ఉన్నాయి. ఇంటి వాళ్ళు తలుపు గడియ పెట్టుకుని లోపల నిద్రపోతున్నారు. ఆ కుండలలో ఒకటి దొంగిలించి తీసుకు పోతే పండితుడు ఓడిపోతాడు. అయితే దొంతర్లకు ఎగువ నున్న కుండ అందదు. అందుచేత రాజు మధ్యలో ఉన్న కుండను తీయబోయాడు. వెంటనే దానికి ఎగువ నున్న కుండలు కదిలి రాజు మీద పడ్డాయి. రాజు చతికిలబడిపోయాడు. ఆయన చుట్టూ పగిలిన కుండ పెంకులున్నాయి.

కుండలు పడి పగిలిన చప్పుడుకు కుమ్మరి బయటికి వచ్చి, జరిగినది చూసి కేకలు పెట్టాడు. చుట్టుపక్కల వాళ్ళు చాలామంది పరిగెత్తుకుంటూ వచ్చారు.

రాజు గుర్తు పట్టదగిన స్థితిలో లేని కారణం చేత వాళ్ళు ఆయనను చావబాదుతూ, "దరిద్రపుగొట్టు వెధవా! ఏ చెంబో, బిందో ఎత్తుకు పోక కుండలను దొంగిలిస్తావా? ఒక్క కుండ కోసం ఇన్ని కుండలు ధ్వంసం చేస్తివే!" అని నానాతిట్లూ తిట్టారు.

చావుతప్పి కన్ను లొట్టబోయినట్టు అయి రాజు తన భవనానికి తిరిగి వెళ్ళి, మర్నాడు పండితుడితో, "మీరన్నమాటే నిజం! అన్నిటిలోకీ కష్టసాధ్యమైనది చోరవిద్యే!" అని ఒప్పుకున్నాడు.





# కొయ్యగుర్రం

## 2

ఈ లోపల రాజకుమారుడు కమర్ ఎక్కిన కొయ్యగుర్రం ఆకాశంలోకి చాలా ఎత్తు పోయింది. అది అలాగే సూర్యుడి దాకా పోతుందా అనిపించింది. కమర్ తనకు కలిగిన ప్రమాదాన్నీ, ప్రాణభయాన్నీ గుర్తించి. తన తొందరపాటుకు పశ్చాత్తాప పడుతూ. "నేను తన పెళ్ళికి అడ్డుపడ్డానని ఆ ముసలివాడు నన్ను చంపదలిచాడనటానికి సందేహం లేదు. దైవేచ్ఛ ఎలా ఉందో! అయినా ఈ కొయ్యగుర్రాన్ని కిందికి దించటానికి మీట ఏదో ఉండే ఉంటుంది," అనుకుంటూ గుర్రం అంతటా తడివాడు. జీనుకు ఎడమపక్క ఆవగింజ ప్రమాణంలో ఒక చిన్న బుడిపె తగిలింది. అది తప్ప గుర్రంమీద మరేదీ లేదు.

కమర్ ఆ చిన్న బుడిపెను నొక్కాడు. వెంటనే గుర్రం పైకి పోయే వేగం తగ్గింది. త్వరలోనే అది పైకి వెళ్ళటం మానేసి కిందికి దిగసాగింది. అంతకంతకూ అది దిగే వేగం హెచ్చింది. కాని భూమి సమీపిస్తూండగా దాని వేగం క్రమంగా తగ్గింది. చివరకు గుర్రం భూమి మీద చక్కగా వాలింది. దానితో రాజకుమారుడి ఆరాటం సర్దుకున్నది.

అతను దుర్మరణం నుంచి బయటపడటమేగాక గుర్రంమీద ఉన్న రెండు మీటల ఉపయోగమూ పూర్తిగా గ్రహించాడు. గుర్రాన్ని పైకీ కిందికీ, ముందుకూ, వెనకకూ నడిపించటం అతను అభ్యాసం చేశాడు. జీను తాళ్ళు లాగి కుడిపక్కకూ, ఎడమపక్కకూ కూడా గుర్రాన్ని నడపవచ్చునని గ్రహించాడు. ఆ గుర్రంమీద ఎంత వేగంతో నడవాలన్నా నడవవచ్చునని అతనికి తెలిసింది.



గుర్రాన్ని నడపటం పూర్తిగా తెలిసిన అనంతరం అతను ఆకాశంలో తగుమాత్రం ఎత్తున, సుమారైన వేగంతో ప్రయాణిస్తూ, ఎన్నడూ ఎరగని దేశాలూ, నగరాలూ, ప్రదేశాలూ చూసి ఆనందిస్తూ ముందుకు పోసాగాడు.

పోగా పోగా, అతనికి దిగువన ఒక నగరం కనబడింది. ఆ నగరంలోని ఇళ్ళన్నీ ఒక పథకం ప్రకారం కట్టినట్టుగా ఉన్నాయి. నగరం చుట్టూ ఉన్న ప్రదేశం ఆకుపచ్చగా నవనవలాడుతున్నది. ఆ పచ్చని తివాసీలాటి బయళ్ళకుండా అనేక సెలయేళ్ళు పారుతున్నాయి. బయళ్ళలో లేళ్ళు పరిగెత్తుతున్నాయి.

"ఈ నగరం ఏమిటో, ఇది ఏ దేశమో చూడాలి," అంటూ కమర్ తన గుర్రాన్ని ఆకాశంలో నగరం చుట్టూ తిప్పి, మధ్య మధ్య వింతలు చూడటానికి గుర్రాన్ని నిలుపుతూ వచ్చాడు.

ఇంతలో సూర్యుడు అస్తమించాడు. ఆ రాత్రి ఆ నగరంలోనే గడపాలని అతనికి అనిపించింది. మర్నాడు ఉదయమే బయలుదేరి తన దేశానికి తిరిగి వెళ్ళి, తన వారిని చేరుకుని, తాను చూసిన వింతలన్నీ వారికి చెప్పుదామని అతను అనుకున్నాడు.

ఎక్కడ తాను గుర్రంతో దిగటమా అని అతను చూసేసరికి నగర మధ్యంలో ఒక ఎత్తయిన భవంతి కనబడింది. దాని చుట్టూ బురుజు రక్షణలున్నాయి. నలభైమంది నీగ్రో యోధులు కవచాలు ధరించి, శూలాలూ, కత్తులూ, విల్లులూ ధరించి ఆ భవంతికి కాపలా కాస్తున్నారు.

రాజకుమారుడు ఆ భవంతి పైభాగాన గుర్రంతో సహా దిగాడు. అతను తన గుర్రాన్ని ఒకసారి తనివితీరా చూసుకుని, "ఎంత అద్భుతమైన పనితనం! ఇది మానవమాత్రుడు చేశాడంటే ఎవరూ నమ్మరు. దేవుడి దయవల్ల నేను ఇంటికి తిరిగి పోతే దీన్ని చేసిన విజ్ఞానిని కానుకలలో ముంచెత్తుతాను," అనుకున్నాడు.

అప్పటికే చీకటి పడింది. కాని భవనం లోపల అంతా మాటు మణిగినదాకా కమర్ పై డాబా మీదనే ఉండిపోదామనుకున్నాడు. అతన్ని ఆకలిదప్పులు బాధిస్తున్నాయి ఇంటి వద్ద బయలు దేరిన తరవాత అతనేమీ తిన లేదు. తాగలేదు. ఇంత పెద్ద మహా భవనంలో తిండి దొరకకపోదని అతనికి అనిపించింది. అందుచేత అతను గుర్రాన్ని అక్కడే వదిలి, తిండికోసం వెతుక్కుంటూ మెట్లమీదుగా కిందికి దిగాడు.

అతను అలా దిగి ఒక ప్రాంగణంలోకి ప్రవేశించాడు. దానిలో చలవరాళ్ళూ, స్ఫటికపు రాళ్ళూ పరిచి ఉండి వెన్నెలలో మెరుస్తున్నాయి అక్కడినుండి చూస్తే రాజ భవనం ఎంతో మనోహరంగా ఉన్నది. ఎక్కడా ఒక్క మనిషి కనిపించలేదు. అలికిడి వినిపించలేదు. తిరిగి మిద్దె మీదికే ఎక్కిపోయి. తన గుర్రం పక్కనే పడుకుని నిద్రపోవటం మేలని అతనికి అనిపించింది. మర్నాడు తెల్లవారగానే గుర్రం మీద తిరిగి వెళ్ళిపోవచ్చు.

కమర్ పైకి ఎక్కబోతూండగా అతనికి భవనం లోపల ఏదో వెలుగు కనిపించింది. అతను ఆ వెలుగు కేసి వెళ్ళాడు. అంతఃపురం వెలపల ఒక దివిటీ వెలుగుతున్నది. ఆ దివిటీకి సమీపంలో ఒక మంచం మీద నీగ్రో కొజ్జావాడు గురకపెడుతూ నిద్రపోతున్నాడు. చూడటానికి పెనుభూతంలాగా ఉన్నాడు. వాడు అంతఃపుర ద్వారానికి అడ్డంగా పడుకుని ఉన్నాడు. దివిటీ వెలు



గులో వాడి ఖడ్గం పిడి మెరుస్తున్నది. వాడి భోజనం సంచీ వాడి తలకు ఎగువగా ఒక రాతి స్తంభానికి వేళ్ళాడుతున్నది.

ఆ భయంకరాకారుణ్ణి చూసి కమర్ ఒక్కసారి భగవంతుణ్ణి స్మరించుకుని, వాడి భోజనం సంచీ దించి, దూరంగా వెళ్ళి దాన్ని తెరిచి, అందులో ఉన్న అమృతప్రాయమైన ఆహారం తిని ఆకలి తీర్చుకుని, జలయంత్రం వద్దకు వెళ్ళి నీరు తాగాడు. తరవాత అతను నీగ్రో నిద్రపోతున్న చోటికి వచ్చి, సంచీ స్తంభానికి తగిలించి, నీగ్రోవాడి కత్తిని ఒర నుంచి లాగేసుకున్నాడు.

తరవాత కమర్ ఇంకా లోపలికి వెళ్ళి మరొక ద్వారం చేరుకున్నాడు. దానికి మఖ్మల్ తెర కట్టి ఉన్నది. కమర్ ఆ తెరను తోసుకుని ఒక అద్భుతమైన గదిలోకి వెళ్ళాడు. ఆ గదిలో దంతంతో తయారు చేసిన మంచం ఒకటి ఉన్నది. దాని నగిషీలలో రత్నాలు పొదిగి ఉన్నాయి. అతను మంచాన్ని సమీపించి చూసేసరికి, దాని మీద ఒక లావణ్యవతి నిద్రపోతూ కనబడింది. ఆ మంచం నాలుగుపక్కలా నలుగురు ఆడబానిసలు పడుకుని నిద్రపోతున్నారు.

మంచం మీద నిద్రపోయే యువతిని చూస్తున్న కొద్దీ కమర్‌కు మతిపోతున్నట్టయింది. అతను సాహసించి ఆమెను సమీపించి ఆమె కుడి చెంపను ముద్దుపెట్టుకున్నాడు.



వెంటనే ఆమె ఉలికిపడి లేచి, కళ్ళు తెరిచి, తన పక్కన నిలబడి ఉన్న యువకుణ్ణి చూసి, "ఎవరు నువు? ఎక్కడినుంచి వచ్చావు?" అని అడిగింది.

"నీ దాసుణ్ణి! నీ కళ్ళు చూసి మోహించాను!" అన్నాడు కమర్.

"నిన్నిక్కడికి పంపినవారెవరు?" అని ఆమె మళ్ళీ అడిగింది.

"అల్లా! నా అదృష్టం!" అన్నాడు కమర్.

ఇది విని రాజకుమారి షమ్స్ అల్ నహార్ ఏ మాత్రమూ కంగారు పడక, "నువు నిన్న నన్ను పెళ్ళాడుతానని వచ్చిన రాజకుమారుడివి కావుగద? అతను అందవికారంగా ఉన్నాడని నా తండ్రి నిరాకరించాడు. నువు అందవికారంగా లేకపోగా చాలా అందంగా ఉన్నావు. నిన్ను చూస్తుంటేనే నా మనసు వివశమైపోతున్నది," అంటూ అతన్ని కౌగలించుకున్నది.

ఆ సమయంలో ఆడబానిసలు నిద్ర మేలుకుని, "అమ్మగారూ, ఈ అబ్బాయిగారెవరు?" అని రాజకుమార్తెను అడిగారు.

"నేను మేలుకునేసరికే ఇక్కడ ఉన్నాడు. నిన్న నన్ను పెళ్ళాడతానని వచ్చిన రాజకుమారుడేమో!" అన్నది రాజకుమార్తె.

నలుగురు బానిసలూ ఒక్కసారిగా, "ఛీ, ఛీ! ఇతను వేరు. ఇతను నవమన్మథుడిలాగున్నాడు. అతను మీకు బానిసగా కూడా పనికిరాడు," అన్నారు.






వాళ్ళు నిద్రపోతున్న నీగ్రో వద్దకు వెళ్ళి లేపి, "మేం నిద్రపోతూండగా పురుషులను అంతఃపురంలోకి ఎలా రానిచ్చావురా?" అని దబాయించారు.

కొజ్జావాడు చివాల్న లేచి నిలబడి కత్తి దూయబోతే ఒరలో కత్తి లేదు. వాడు పరుగెత్తుకుంటూ గది లోపలికి వచ్చి కమర్‌ను చూసి, గడగడ వణికిపోతూ, "అయ్యా, తమరు మనిషా? భూతమా?" అని అడిగాడు.

కమర్ కోపంగా కత్తి దూసి, "నీచుడా, రాజకుమారులను చూసి భూతాలనుకుంటావురా? నేను రాజుగారి అల్లుణ్ణి. రాజకుమార్తెను పెళ్ళాడాను. అందుచేత నాకు అంతఃపురంలోకి రావటానికి అధికారం ఉన్నది," అన్నాడు.

"బాబూ, తమరు అమ్మాయిగారికి తగిన మొగుడే లెండి!" అంటూ కొజ్జావాడు త్వరగా రాజు వద్దకు వెళ్ళి, జుట్టు పీక్కుని ఏడుస్తూ, "మహారాజా, వెంటనే అమ్మాయిగారిని కాపాడండి. ఏదో భూతం రాజకుమారుడి రూపంలో అమ్మాయిగారిని ఆవహించింది!" అన్నాడు.

ఆ కొజ్జావాణ్ణి నరకాలన్నంత కోపం వచ్చింది రాజుకు, కాని ఆయన నిగ్రహించుకుని, "వెధవా, ఆ దయ్యం లోపలికి పోతుంటే నువేం చేస్తున్నావు? నిన్ను అహోరాత్రాలు అంతఃపురానికి కాపలా ఉంచింది ఎందుకు?" అని కొజ్జాను తిట్టి, మతిపోయినవాడిలాగా రాజకుమార్తె పడకగదికి వెళ్ళాడు.

బానిస స్త్రీలు ద్వారం దగ్గిర భయంతో కంపిస్తూ కనిపించారు. రాజు వారిని, "రాజకుమార్తె కేమయింది?" అని అడిగాడు.

దానికి వాళ్ళు, "మహారాజా, మేము నిద్రలో ఉండగా ఏమయిందో మాకు తెలియదు. మేము మేలుకునేసరికి రాజకుమార్తెతో మాట్లాడుతూ ఒక నవమన్మథుడు కనిపించాడు. అంత అందమైన యువకుణ్ణి మేము ఎన్నడూ చూడలేదు. మేము ప్రశ్నిస్తే అతను, తనకూ రాజ

కుమార్తెకూ తమరు పెళ్ళి చేశారన్నాడు. అంతకంటే మా కేమీ తెలియదు. అతను మనిషో, దేవతో మే మెరగం. ఎవరైనప్పటికీ అతను మంచివాడు, సౌమ్యుడు, సజ్జనుడు," అన్నారు.

ఈ మాటలతో కొంత శాంతించి రాజు తెర ఎత్తి లోపలికి చూశాడు. ఆయనకు తన కుమార్తెతో మాట్లాడుతున్న కమర్ కనిపించాడు.

తన కుమార్తె శీలం మాట గుర్తు రాగానే రాజుకు తిరిగి ఆగ్రహం వచ్చింది. ఆయన కత్తి దూసి ముందుకు వెళ్ళాడు. ఆయన రాజుగారేనని రాజకుమార్తె నడిగి తెలుసుకుని, కమర్ తాను కూడా కత్తి దూసి పెద్దగా పెడబొబ్బ పెట్టేసరికి రాజు స్తంభించిపోయాడు. కమర్ ఆయన మీదికి కత్తి ప్రయోగించబోయాడు. తాను బలహీనుడైన సంగతి గ్రహించి రాజు తన కత్తిని ఒరలో పెట్టేసి, "అబ్బాయీ, నువు మనిషివా? పిశాచివా?" అని అడిగాడు.

దానికి కమర్ ఆవేశంతో, "మీరు నాతో సమానస్థులనీ, మీ కుమార్తె సౌశీల్యవతి అనీ అనుకోవటం వల్ల ఇంతవరకూ మీ ప్రాణాలు దక్కాయి. లేకపోతే ఈ పర్షియారాజ కుమారుడు మిమ్మల్నీ, మీ రాజ్యాన్నీ ఈ పాటికి మట్టిలో కలిపి ఉండేవాడు," అని జవాబు చెప్పాడు.




ఈ మాటలు విని రాజుకు భయమూ, గౌరవమూ కూడా కలిగాయి. ఆయన కమర్‌తో, "నువు నిజంగా రాజకుమారుడివైతే, పిలవకుండా పెట్టకుండా ఏమని రాజభవనంలో ప్రవేశించావు? నా కుమార్తెను వశం చేసుకుని మాకు కళంకం ఎందుకు తెచ్చిపెట్టావు? నా కుమార్తెను ఎందరో రాజకుమారులకు ఇయ్య నిరాకరించిన నేను నీకు ఆమెనిచ్చి వివాహం చేశానని ప్రకటించావు? నిన్నిప్పుడు నా బానిసల చేత చిత్రవధ చేయిస్తే ఎవరు అడ్డుతారు?" అన్నాడు.

కమర్ రాజుతో, "మీ మందబుద్ధి చూస్తే నాకు ఆశ్చర్యం కలుగుతున్నది. మీ అమ్మాయికి నా కన్న యోగ్యుడైన భర్త ఎవడు

దొరుకుతాడు? నా కన్న సాహసవంతుడూ, సంపన్నుడూ ఏనాడైనా మీ కళ్ళ పడ్డాడా?" అన్నాడు.

"నిజమే కావచ్చు. కాని నువు నా కుమార్తెను వివాహమాడదలిస్తే, అది కాజీ సహాయంతో, సాక్షుల సమక్షాన జరగాలి. రహస్య వివాహం అపఖ్యాతి కలిగిస్తుంది," అన్నాడు రాజు కోపంగా.

"సరిగానే చెప్పారు. కాని ఇప్పుడు మీరు మీ భటులను పిలిస్తే, మీకూ, మీ రాజ్యానికీ తలవంపులే గదా? ఈ విషయంలో నేను చెప్పినట్టు చెయ్యటం తప్ప మీకు గత్యంతరం లేదు," అన్నాడు కమర్.

"ఏమిటో కాస్త చెప్పు. వింటాను," అన్నాడు రాజు.

"మీ కున్నవి రెండే మార్గాలు. ఒకటి, కత్తిపట్టి నాతో ద్వంద్వయుద్ధం చెయ్యటం; అందులో ఓడిపోతే మీ రాజ్యాన్ని నాకు ధారాదత్తం చెయ్యటం. అలా కాదంటారా, నన్ను ఈ రాత్రి రాజకుమార్తెతో గడప నివ్వండి; తెల్లవారుతూనే మీకు గల సైన్యం యావత్తూ నా మీదికి పంపండి. అన్నట్టు మీ కెంత సేన ఉన్నది?" అని కమర్ రాజును అడిగాడు.

"నాకు నలభైవేల సేన ఉన్నది. అది గాక, నా బానిసలూ, ఆ బానిసల బానిసలూ మరో నలభైవేలమంది ఉంటారు," అన్నాడు రాజు ధీమాగా.

"మంచిది. తెల్లవారుఝామున వారినందరినీ సైనికవ్యూహంలో నిలబెట్టి, నేను రాజకుమార్తెను పెళ్ళాడ గోరుతున్నాననీ, అందుకు గాను వారితో ఒంటరిగా యుద్ధం చెయ్యగోరుతున్నాననీ వారితో చెప్పండి. వారు నన్ను చంపగలిగితే మీ రహస్యం నాతోనే పోతుంది. నేను వారిని జయించ గలిగితే, మీ అల్లుడు అసాధారణ పరాక్రమవంతుడన్న కీర్తి మీకు దక్కుతుంది," అన్నాడు కమర్.

ఆ కుర్రవాడి దుస్సాహసం ఏమిటో తనకు అంతు చిక్కకపోయినప్పటికీ, రాజు ఈ ఏర్పాటుకు సమ్మతించాడు.

—(ఇంకావుంది)



# తగిన బహుమానం

ఒక జమీందారు కచేరీసావడిలో కూర్చుని వ్యవహారాలు చూసుకుంటూ ఉండగా ఒక కవి వచ్చి, "తమరు ఇంద్రుడు, చంద్రుడు," అంటూ పద్యం చెప్పాడు.

స్తోత్రపాఠాలకు చలించని జమీందారు కవిని మెచ్చుకుంటున్నట్టు నటించి షరాబుతో, "ఈ కవిగారికి నూరురూపాయలు ఇచ్చి పంపించు," అన్నాడు.

కవి ఈ మాటలకు పొంగిపోయి, జమీందారు కుబేరుడనీ, దానానికి కర్ణుడనీ మళ్ళీ పద్యం చదివాడు.

"ఈయనకు నూరుకాదు, వెయ్యి ఇచ్చి పంపించు," అన్నాడు జమీందారు. కవిగారు ఇంకా పరవశుడైపోయాడు.

షరాబు కవిని అవతలికి వెళ్ళి కూర్చుని ఉండమని, "ఇంతకూ ఆయనకు ఏమి ఇయ్యమన్నారు?" అన్నాడు జమీందారుతో.

"ఇచ్చేదేదో నే నిచ్చాను గద? నువ్వేమీ ఇవ్వనక్కర్లేదు. ఆయనగారు బొల్లిమాటలతో నన్ను సంతోష పెడదామనుకున్నాడు. కాని బొల్లిమాటలతో నేనే ఆతగాణ్ణి నిజంగా సంతోష పెట్టాను. సరికి సరి!" అన్నాడు జమీందారు.





# ఇద్దరిలో మేటి

మగధరాజుకు ఇద్దరు భార్యలు. ఆ ఇద్దరూ ఒకే రోజున, ఒకే క్షణాన చెరొక మగ బిడ్డనూ కన్నారు. ఒక బిడ్డకు అమరసింహు డనీ, రెండో వాడికి జయసింహుడనీ పేర్లు పెట్టారు.

ఇద్దరు బిడ్డలూ రూపంలోనూ, సౌష్టవం లోనూ ఒకరి కొకరు తీసిపోకుండా పెరుగుతూ వచ్చి, అన్ని విద్యలలోనూ సరి సమాను లనిపించుకున్నారు. యుద్ధవిద్య లలో కూడా వారిలో ఎవరు ఎవరికి తీసి పోయేదీ నిర్ణయించటం సాధ్యం కాలేదు.

అయితే వారిద్దరిలోనూ ఒక తేడా ఉన్నది. అమరసింహుడు గుర్రపుస్వారీలోనూ, కత్తి యుద్ధంలోనూ మిన్న. జయసింహుడు ఏనుగు స్వారీలోనూ, మల్లయుద్ధంలోనూ సాటిలేనివాడు.

ఇద్దరు రాజకుమారులూ ఎంతో అన్యో న్యంగా ఉండేవారు.

రాజుకు వార్థక్యం వచ్చింది. తన అనంతరం తన కొడుకులలో ఎవరు సింహాసనం మీద కూర్చోవాలన్న సమస్య రాజును బాధించసాగింది. ఇద్దరు పిల్లలూ ఒకే రోజు పుట్టారు; ఒకరు పెద్దా, ఒకరు చిన్నా అన్న సమస్యలేదు. రాజ్యం రెండుగా చీల్చే సమస్య కూడా లేదు. అందుచేత వారిద్దరి యోగ్యతలలోనూ ఏదైనా వ్యత్యాసం కనిపెట్టి, హెచ్చు యోగ్యతగల వాడికి పట్టం కట్టాలి. రాజూ, మంత్రీ ఎంతోకాలం చర్చించి ఇలాంటి నిర్ణయానికి వచ్చారు. కాని ఇద్దరు రాజకుమారుల యోగ్యతలలో ఎవరిది ఎక్కువన్నది నిర్ణయించటం వారికి సాధ్యం కాలేదు.

రాజూ, మంత్రీ తమలో ఎవరికి సింహాసనం యివ్వాలన్న దాన్ని గురించి ఇంతగా ఆలోచిస్తున్నట్టు రాజకుమారులకు ఏ మాత్రం తెలియదు.

హెచ్. సువర్ణలత

ఇలా ఉండగా కౌశికదేశపు రాజకుమారికి స్వయంవరం ప్రకటించారు. ఆ సందర్భంలో వివిధ విద్యలలో పోటీలు పెట్టి, వాటిలో నెగ్గిన వారికి రాజకుమార్తెను వివాహం చేసేటట్టు నిర్ణయించబడింది.

ఈ సంగతి విని రాజూ, మంత్రీ కూడా రాజకుమారులను స్వయంవరానికి పంప నిశ్చయించారు. అక్కడే వారి శక్తి సామర్థ్యాలలో ఉన్న తేడా బయటపడుతుందని వారి నమ్మకం.

తండ్రి కోరిన మీదట అమరసింహుడూ, జయసింహుడూ కౌశిక రాజకుమార్తె స్వయంవరానికి వెళ్ళారు.

స్వయంవరానికి అనేకమంది రాజకుమారులు వచ్చారు. అమరసింహ, జయసింహులు విడివిడిగా వారితో పోటీ చేసి, అందరినీ ఓడించి, సమంగా విజయాలు సాధించారు. వారిద్దరి మధ్యా పోటీ జరిగినప్పుడు కత్తి యుద్ధంలోనూ, గుర్రపుస్వారీలోనూ అమరసింహుడిది పై చెయ్యి అయింది. మల్ల యుద్ధంలోనూ, ఏనుగు స్వారీలోనూ జయసింహుడిది పై చెయ్యి అయింది. ఆ విధంగా కూడా వారిద్దరి విజయాల సంఖ్య ఒకటే అయింది.

కౌశికరాజు వారిద్దరి మధ్యా ఎవరికి తన కుమార్తె నిచ్చి చెయ్యాలో తేల్చుకోలేక, తన నిర్ణయాన్ని ప్రకటించటానికి మూడు రోజులు గడువు పెట్టి, అందరినీ బసలకు పంపేశాడు. తరవాత ఆయన తన మంత్రులతో ఆలోచించి ఒక చాటింపు వేశాడు.



ఆ చాటింపు ఏమిటంటే, అమరసింహ, జయసింహులలో ఎవరు గొప్పో తెలిపిన వారికి తన అర్థరాజ్యం ఇచ్చి, తన రెండవ కుమార్తె నిచ్చి పెళ్ళి చేస్తానని.

చాటింపు జరిగిన మర్నాడు రాజసభకు ఒక ముని, తన శిష్యుణ్ణి వెంట బెట్టుకు వచ్చి, "రాజా, మీ కుమార్తె స్వయం వరంలో ఏర్పడిన సమస్యను నా శిష్యుడు పరిష్కరిస్తాడు," అని చెప్పాడు.

రాజు చాలా సంతోషపడి, "ఏమిటా పరిష్కారం?" అని అడిగాడు.

అప్పుడు మునిశిష్యుడు రాజుతో ఇలా అన్నాడు:

"రాజా, అమరసింహ, జయసింహులలో అమరసింహుడే మిన్న. అమరసింహుడు జయసింహుడి కన్న కత్తి యుద్ధంలోనూ, గుర్రపు స్వారీలోనూ మించగలడు; ఏనుగు స్వారీలోనూ, మల్లయుద్ధంలోనూ తక్కువే. కాని ఏనుగు పై నున్న ఖడ్గం లేని వీరుడి కన్న, గుర్రం పై నున్న ఖడ్గవీరుడు గొప్ప వీరుడు కాడా? అదీగాక గుర్రం ఏనుగు మీదిగా దూకి పోగలదు. ఏనుగు గుర్రం మీదుగా దూకలేదు. ఏనుగు పై నుండే మల్లుడు గుర్రం మీద ఉండి కత్తి పట్టిన వాణ్ణి ఏ పరిస్థితిలోనూ చంపలేడు. కాని ఏనుగు మీద ఉన్న మల్లుణ్ణి కత్తి పట్టిన అశ్వికుడు తేలికగా చంపగలడు. ఈ కారణాల వల్ల జయసింహుడి కన్న అమరసింహుడే మిన్న."

ఈ వాదాన్ని సభలో అందరూ ఆమోదించారు. రాజు కూడా తన సమస్యా పరిష్కారమైనట్టు తృప్తిపడ్డాడు.

వెంటనే మునీ, ఆయన శిష్యుడూ తాము ధరించిన వేషాలు విప్పి, అసలు రూపాలతో ప్రత్యక్షమయారు. ముని అమరసింహుడే, అతని శిష్యుడు జయసింహుడు.

కౌశికరాజు తన కుమార్తెల నిద్దరినీ అన్నదమ్ముల కిచ్చి పెళ్ళి చేసి, జయసింహుడికి అర్ధరాజ్యం ఇచ్చేశాడు.

మగధరాజు సమస్య కూడా తీరిపోయింది కనక, ఆయన అమరసింహుడికి పట్టాభిషేకం చేసేశాడు.



# మర్యాదకు కారణం

ఒక గ్రామంలో కరువు రానున్న సూచనలు కలిగాయి. ఆ గ్రామానికి చెందిన ధాన్యం వ్యాపారి ధాన్యం చవకగా దొరికే దూరప్రాంతానికి బయలుదేరాడు. అతని వెంట చెప్పులు కుట్టేవాడు తోళ్ళు కొనుక్కురావటానికి తాను కూడా బయలుదేరాడు.

దారిలో ఒక ముని వారికి ఆతిథ్యం ఇచ్చి, వర్తకుడికి హెచ్చు మర్యాద చేశాడు. వాళ్ళు తమకు కావలిసిన ధాన్యమూ, తోళ్ళూ కొనుక్కుని గ్రామానికి తిరిగి వచ్చేటప్పుడు ఆ ముని వారికి ఆతిథ్యమిచ్చి, ఈసారి చెప్పులు కుట్టేవాడికి హెచ్చుగా మర్యాద చేశాడు.

ఆయన అలా చేయటానికి కారణమేమిటని వారిద్దరూ మునిని అడిగారు.

"వర్తకుడా, నువు వెళ్ళేటప్పుడు వెళ్ళేచోట చక్కగా పంటలు పండి సుభిక్షంగా ఉండాలనీ, ధాన్యం పుష్కలంగా ఉండాలనీ కోరుకున్నావు. ఈ చెప్పులుకుట్టేవాడు అక్కడ కరువు వచ్చి ఉండాలనీ, గొడ్లు అధిక సంఖ్యలో చచ్చి ఉండాలనీ కోరుకున్నాడు. అందు చేత నీకు ఎక్కువ మర్యాద చేశాను. తిరిగి వచ్చేటప్పుడు, మీ గ్రామంలో కరువు వచ్చి ఉండాలనీ, ధాన్యానికి మంచి గిరాకీ రావాలనీ కోరావు. చెప్పులు కుట్టేవాడు గ్రామంలో సుభిక్షంగా ఉండి, అందరివద్దా పుష్కలంగా డబ్బుండాలని కోరుకున్నాడు. అందుచేత అతడికి ఎక్కువ మర్యాద చూపాను," అన్నాడు ముని.

—కాకుమాను వెంకట బాలసుబ్బారావు.





# పునర్జన్మ

ఉగ్రగుప్త మహారాజుకు ఇద్దరు కొడుకులు. వారి ప్రవృత్తులు పరస్పర విరుద్ధమైనవి. పెద్దవాడూ, యువరాజూ అయిన శంకర గుప్తుడు ధూర్తుడూ, క్రూరుడూనూ.

చిన్న వాడు శేఖరగుప్తుడు నెమ్మదైన వాడూ, దయా స్వభావుడూనూ. అతను అస్తమానమూ ధర్మచింతనలో ఉండేవాడు.

శంకరగుప్తుడు అంటే ఎవరికీ ఇష్టం లేదు. కాని రాజుగారి పెద్ద కొడుకు కావటాన సింహాసనానికి అతనే వారసుడు.

శంకరగుప్తుకు శేఖరుడంటే అమితమైన అసూయాద్వేషాలు ఉండేవి. అతణ్ణి తుద ముట్టించాలని అతను నిశ్చయించాడు.

ఉగ్రగుప్తుడికి మాత్రం శంఖరు డంటే చాలా అభిమానం. అతని క్రూరత్వం అయన కంటికి ధైర్యంలాగా కనబడేది. మెత్తనివాడైన శేఖరుడు ఆయనకు పరాక్రమ హీనుడిలాగా కనబడేవాడు.

అసూయతో కుమిలిపోతున్న శంకర గుప్తుడు ఒకనాడు తన తమ్ముణ్ణి హత మార్చటానికి పథకం వేశాడు. అతను శేఖ రుణ్ణి వేటకు పిలిచాడు. ఇద్దరూ గుర్రాల మీద అరణ్యానికి బయలుదేరారు. వారు అరణ్య మధ్యంలో ఉండగా శంకరగుప్తుడు కత్తి దూసి శేఖరుణ్ణి పొడవబోయాడు.

తన ప్రాణాన్ని కాపాడుకునేటందుకు శేఖరగుప్తుడు పైనుంచి వేళ్ళాడుతున్న లతలను పట్టుకుని తన గుర్రంమీది నుంచి పైకి లేచాడు. అతని గుర్రం వెనక్కు నడిచి, శంకరగుప్తుడి గుర్రాన్ని ఢీ కొన్నది. శంకరగుప్తుడి గుర్రం వెనక కాళ్ళపై లేచింది. శేఖరగుప్తుడు గుర్రం మీదినుంచి కాళ్ళు పైకి ఎత్తటంలో అతని కత్తి ఒర నుంచి జారి, కింది బురద మట్టిలో దాని పిడి గుచ్చుకుని, అది నిటారుగా నిలబడింది. అదే సమయంలో, వెనక కాళ్ళపై లేచిన

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు

తన గుర్రం మీదినుంచి శంకరగుప్తుడు పడిపోతూ, శేఖరుడి కత్తి మీద సూటిగా పడ్డాడు. కత్తి డొక్కలో దిగబడింది. శంకర గుప్తుడు వెంటనే ప్రాణాలు విడిచాడు.

ఇంతలో పరివారం వాళ్ళు అక్కడికి వచ్చి, శేఖరగుప్తుడి కత్తితో శంకరగుప్తుడు చచ్చిపోయి ఉండటమూ, శేఖరుడు పక్కనే నిలబడి ఉండటమూ చూశారు.

శంకరగుప్తుణ్ణి హత్యచేసిన నేరం శేఖర గుప్తుడిపై ఆపాదించబడింది. అతను నిర్దోషి అనటానికి తగిన ఆధారంగాని, సాక్ష్యంగాని లేకపోయింది. అతను జరిగిన సంగతి న్యాయాధిపతికి చెప్పాడు, కాని న్యాయాధి పతికి అదంతా కట్టుకథగా తోచింది. అందు చేత ఆయన శేఖరగుప్తుడికి మరణశిక్ష విధించాడు.

రానున్న శుక్రవారం నాడు మధ్యాన్నం సరిగా సూర్యుడు నడిమింట ఉండగా పదిమంది విలుకాళ్లు ఒకేసారి అతన్ని బాణాలతో కొట్టి మరణశిక్ష అమలు చేస్తారు.

ఆ దేశపు శిక్షాస్మృతి చాలా చిత్రమైనది. నిర్ణీతమైన క్షణంలో సేనాపతి అయిన దండకుడు ఒక ఎర్రని చేతి రుమాలును కింద పడవేస్తాడు. అది కిందపడిన క్షణంలో విలుకాళ్ళు బాణాలు వదులుతారు. ఏ కారణం చేతనైనా శిక్షానియమాలు సరిగా అమలుకాకపోతే దండన రద్దయిపోతుంది.




శేఖరగుప్తుడి మరణశిక్ష తాను స్వయంగా అమలు చేయించాలన్నది సేనాపతి దండ కుడికి అంతులేని బాధ కలిగించింది. ఆయనకు శేఖరుడు అంటే అమితమైన వాత్సల్యం. వచ్చే శుక్రవారం మిట్ట మధ్యాహ్న లిప్తలో తన ఎడమ చేత్తో ఎర్ర చేతి రుమాలు కింద పడేసి, విలు కాళ్ళకు సంకేతం ఇవ్వటం అసాధ్యం, అసాధ్యం! ఆయన నిద్రాహారాలు లేకుండా ఈ సమస్య గురించి బాధపడ్డాడు.

దండకుడికి అకస్మాత్తుగా ఆ దేశపు శిక్షాస్మృతిలో గల తిరుగుడు గుర్తుకు వచ్చింది. ముఖ్యంగా రాజకుటుంబానికి చెందిన వారి విషయంలో శిక్ష నిర్ణయించిన

క్షణంలో అమలు జరగని పక్షంలో అది రద్దయిపోతుంది.

కాని ఆ క్షణాన్ని తప్పించటమెలా? ఈ ఉపాయం ఆస్థాన ఐంద్రజాలికుడు ఇంద్రనాథ్ మాత్రమే చెప్పగలడని దండకుడికి స్ఫురించి, అతణ్ణి కలుసుకుని తన ఆవేదన తెలుపుకున్నాడు.

ఇంద్రనాథ్ ఒక ఎర్ర చేతిరుమాలు తీసుకుని దాని కొసకు ఒక రబ్బరు తాడు లాటిది, జానెడు పొడుగుది, సూదీ దారం తీసుకుని కుట్టాడు; తాడు రెండవ చివరను దండకుడి చొక్కా ఎడమచేతి లోపల చంక దగ్గరలో కుట్టేశాడు. మామూలుగా ఆ చేతిరుమాలు దండకుడి చొక్కా ఎడమ చేతి లోపల కనిపించకుండా ఉంటుంది. దాన్ని లాగి చేతిలో పట్టుకున్నప్పుడు రబ్బరు తాడు సాగుతుంది; కాని చేతి రుమాలును విడిచిపెట్టగానే అది చొక్కా చేతిలోకి దూరి పోయి మాయమవుతుంది.

శుక్రవారం వచ్చింది. మిట్టమధ్యాన్నం కావస్తూ ఉండగా దండకుడు ఎర్రచేతి రుమాలును ఎడమ చేతి వేళ్ళతో గట్టిగా పట్టుకుని నిలబడి ఉన్నాడు. శేఖరగుప్తుణ్ణి ఒక స్తంభానికి కట్టేశారు. అతనికి ఎదురుగా పదిమంది విలుకాళ్ళు బాణాలు విల్లులకు సంధించి సిద్ధంగా ఉన్నారు. వాళ్ళు దండకుడి చేతిరుమాలు కేసి చూస్తున్నారు. సూర్యుడు సరిగా నడి నెత్తికి వచ్చేశాడు. దండకుడు తన చేతిలోని రుమాలును కిందికి వదిలాడు. కాని అది కింద పడక, చిత్రంగా అదృశ్యమయింది! విలుకాళ్ళు దిగ్భ్రమ చెందారు. చూడ వచ్చిన జనం మరింత దిగ్భ్రమచెందారు.

ఈ లోపల ముహూర్తం దాటిపోయింది. శేఖరగుప్తుడి మరణ దండన రద్దయిపోయింది. "యువరాజు శేఖరగుప్తుడికి జయం! జయం!" అని జనం కేకలు పెట్టారు. తన కొడుకును ఏ దేవతలో కాపాడారనుకుని రాజు పరమానందభరితుడై, శేఖరగుప్తుణ్ణి కౌగలించుకున్నాడు. దండకుడూ, ఇంద్రనాథ్ ఒకరినొకరు చూసి చిరునవ్వు నవ్వుకున్నారు.






# చపలచిత్తం

ఒకరైతు నాగలి తీసుకుని, ఎడ్లను తోలుకుని పొలానికి వెళ్ళి, పొలం దున్నుకుంటూ ఉండగా నాగలికి ఏదో అడ్డు తగిలింది. తీసి చూస్తే ఒక కంచుపాత్ర దొరికింది. దాని నిండా బంగారం ఉన్నది.

అది చూసి రైతుకు మతి చలించినట్ట యింది. ఆ బంగారంతో ఎన్ని పనులైనా చెయ్యవచ్చు, ఎంతో గొప్పవాడైనా కావచ్చు. కాని అపాయం కూడా ఉన్నది. దొంగలకు తెలిస్తే దోచుకుపోతారు. అడ్డం వస్తే నిలువునా చంపేస్తారు.

ఇలాటి విరుద్ధ ఆలోచనలతో రైతు సత మతమవుతూండగా, దూరంగా వెళుతూ న్యాయాధికారి కనిపించాడు. ఈ బంగార మంతా న్యాయాధికారికి ఇచ్చేస్తే తనకు ఏ భయమూ ఉండదనుకుని రైతు పరిగెత్తు కుంటూ వెళ్ళి న్యాయాధికారిని కలుసుకుని, ఆయనకు వినయంగా నమస్కరించి; దయచేసి ఒక్కసారి తన పొలంలోకి రమ్మని కోరాడు.

ఇద్దరూ కలిసి కంచుపాత్ర భూమిలో ఉన్నచోటికి వచ్చారు. అయితే ఇంతలోనే రైతుబుద్ధి మారిపోయింది. అతను ఆ పాత్ర మీదికి ఇంత మట్టి తోసి, న్యాయాధికారితో, "తమరు ఏదన్నా నిర్ణయించగలరు. నా రెండెద్దుల్లో ఏది మెరుగంటారు?" అన్నాడు.

ఈ ప్రశ్న విని న్యాయాధికారి చిరాకుపడి, తన దారిన తాను వెళ్ళిపోయాడు.

"ఆయనగారికి ఆ బంగారం ఎందు కిచ్చాను కాను? దీన్ని ఎవరికంటా బడ కుండా ఎక్కడ దాచను?" అని రైతు మరింతగా భయపడసాగాడు.

అతనికి పగలంతా ఈ సమస్యను గురించి ఆలోచించటంతోనే సరిపోయింది. పొలంపని ఏమీ జరగలేదు.

ఎల్. హరినారాయణ

చీకటి పడబోతూ ఉండగా న్యాయాధి కారి గ్రామానికి తిరిగి వస్తూ రైతుకు కనపడ్డాడు.

రైతుకు ప్రాణం లేచివచ్చింది. వాడు పరిగెత్తుకుంటూ వెళ్ళి న్యాయాధికారిని కలుసుకుని ఆయనను తన పొలంలోకి ఒక్కసారి అడుగుపెట్టమని ప్రాధేయపడ్డాడు.

న్యాయాధికారి ఏదో అక్రమం జరిగిందనుకుని, రైతు వెంట వచ్చాడు. కాని అంతలోనే రైతు బుద్ధి మారిపోయింది. వాడు ఆయనతో, "తమరు అన్నీ తెలిసినవారు. చూడండి, నేను నిన్న దున్నిన ఆ చాళ్ళు బాగున్నాయా, ఇవాళ దున్నిన ఈ చాళ్ళు బాగున్నాయా?" అని అడిగాడు.

వాడికి మతిచలించిం దనుకుని న్యాయాధికారి నవ్వుకుంటూ తన దారిన వెళ్ళిపోయాడు.

ఆయన వెళ్ళిపోగానే రైతు కుంగిపోయి, "ఆయనకు ఆ బంగారం ఎందుకిచ్చాను కాను? దీన్ని ఎక్కడ దాచను? ఎలా దాచను?" అని దిగులుపడ్డాడు.

చివరకు వాడు, తాను రోజూ తిండి తెచ్చుకునే గోతం సంచీలో ఆ బంగారం గల పాత్రను ఉంచి. వీపున వేసుకుని ఇంటికి వెళ్ళాడు.

వాడు తన భార్యతో, "ఏమే, కాస్త ఎడ్లను కట్టేసి, వాటి కింత మేతవెయ్యి. నేను తొందరగా న్యాయాధికారిగారి ఇంటికి పోవాలి," అన్నాడు.



తన మొగుడు వీపు మీది సంచీ దించక పోవటం గమనించి రైతు భార్య అందులో ఏదో రహస్యం ఉన్నదని గ్రహించింది. అదేమిటో తెలుసుకోవాలని పట్టుదల కలిగింది.

ఆమె రైతుతో, "నా కిదేపనా? ఆవులనూ, గొర్రెలనూ చూస్తున్నాను చాలదూ? నీ ఎడ్లను నువే కట్టేసుకో. ఆ తరవాత నీ యిష్టం వచ్చిన చోటికి వెళ్ళి, నీ ఇష్టం వచ్చినప్పుడు తిరిగిరా," అన్నది.

చేసేదిలేక, రైతు వీపుమీది మూట కింద దించి ఎడ్లను కట్టెయ్యబోయాడు. వెంటనే రైతుభార్య మూటలో నుంచి కంచుపాత్ర పైకి తీసింది. దాని నిండా బంగారం! రైతు ఎడ్లను కట్టేసి, మేత వేసి తిరిగివచ్చేలోపుగా ఆమె ఆ పాత్రను దాచి, అదే ఆకారమూ బరువూగల రాయి ఒకటి తీసుకువచ్చి సంచీలో పెట్టింది.

రైతు పని ముగించుకుని వచ్చి, మూటను వీపున పెట్టుకుని, తిన్నగా న్యాయాధికారి ఇంటికి వెళ్ళాడు.

"తమకు ఒక బహుమానం తెచ్చాను, దొరా!" అన్నాడు వాడు.

న్యాయాధికారి అది ఎంత విలువైన బహుమానమో అనుకుంటూ సంచీ తీసి చూసే సరికి రాయి కనిపించింది.

న్యాయాధికారితోబాటు రైతు కూడా ఆశ్చర్యపోయాడు.

రైతు ప్రవర్తనకు ఏదో బలమైన కారణం ఉంటుందని తోచి న్యాయాధికారి ఆ రాత్రి



వాణ్ణి ఒక కొట్లో బంధింపజేసి, రాత్రి వాడు ఏం మాట్లాడుకుంటాడో, ఏం చేస్తాడో గమనించమని ఇద్దరు జవానులను నియోగించాడు.

రైతు ఆ కొట్లో కూచుని పైకి వినపడకుండా గొణుగుతూ, చేతులతో అభినయిస్తూ, 'ఇంతలావు చెంబు! ఇంత ఎత్తు! దాని నిండా బంగారమే! నిజంగా బంగారమే!' అనుకున్నాడు.

జవానులు న్యాయాధికారితో రైతు చేతులతో చేసిన అభినయం వివరించి చెప్పారు. న్యాయాధికారి వాణ్ణి తన వద్దకు తీసుకు రమ్మని జవానులకు చెప్పి, వాడు రాగానే, "చేతులతో ఏదో కొలుస్తున్నావట! ఏమిటా కొలిచేది?" అని అడిగాడు.

రైతుకు అంతలో ధైర్యం వచ్చింది. వాడు న్యాయాధికారితో, "తమరి కొలతలే తలుచుకుంటున్నాను, దొరా. తమరి తల ఇంత లావుంటుంది. తమరి మెడ ఇంత మందం ఉంటుంది. తమరి పొట్ట ఈ పాటి ఉంటుంది," అన్నాడు.

న్యాయాధికారికి పట్టరాని ఆగ్రహం వచ్చి "ఈ వెధవను వెంటనే ఉరి తీసెయ్యండి," అని జవానులను ఆజ్ఞాపించాడు.

వారు రైతును తీసుకుపోయి, ఉరి కంబం ఏర్పాటు చేసి, తాడు బిగించి, ఉచ్చు మెడకు తగిలించబోతూండగా రైతు, "ఆగండి, న్యాయాధికారిగారికి ఒక్క మాట చెప్పాలి," అన్నాడు.

జవానులు వాణ్ణి న్యాయాధికారి దగ్గిరికి తీసుకుపోయి వాడి చివరి కోరిక ఆయనకు నివేదించారు.

"ఏమిటి నువు నాకు చెప్పాలనుకున్నది?" అని న్యాయాధికారి రైతును అడిగాడు.

"చూడు, దొరా! మీ మనుషులు ఆ ఉచ్చు నా మెడకు బిగిస్తే నాకు ఊపిరి ఆడేదికాదు," అన్నాడు రైతు.

న్యాయాధికారికి నవ్వు ఆగలేదు. "ఆ వెధవను వదిలెయ్యండి," అన్నాడాయన.

రైతు ఇంటికి తిరిగి వెళ్ళి, బంగారం పెట్టుకుని తన భార్యతో సుఖంగా జీవించాడు.






ధృతరాష్ట్రుడు కూడా యుద్ధం ప్రమాదకరమని దుర్యోధనుణ్ణి హెచ్చరించాడు. దుర్యోధనుడు ఎవరి మాటలూ వినిపించుకోలేదు. సభలో కూర్చుండి ఉన్న రాజులు యుద్ధం తప్పదని రూఢి చేసుకుని, లేచి వెళ్ళిపోయారు.

ధృతరాష్ట్రుడికి తన కొడుకులు యుద్ధం చేసి గెలవాలన్న ఆశ ఉన్నది. ఆయన సంజయుణ్ణి రహస్యంగా పిలిచి, "సంజయా, నీకు పాండవ బలమూ, మన బలమూ కూడా తెలుసు గనక, పాండవుల పక్షాన యుద్ధం చేసేవారిలో ఉత్సాహంగా ఉన్న వారెవరో, నీరసంగా ఉన్నవారెవరో, బలం గలవారూ, బలహీనులూ ఎవరో కాస్త చెప్పు," అన్నాడు.

దానికి సంజయుడు, "రాజా, నేను నీకు ఏకాంతంలో ఏమీ చెప్పను. నేను చెప్పేది విని నువు అసూయపడతావు. అందుచేత వ్యాసుణ్ణీ, గాంధారినీ ఇక్కడికి పిలిపించు, అన్నాడు.

త్వరలోనే వ్యాసుడూ, గాంధారీ వచ్చారు. అప్పుడు సంజయుడు ధృతరాష్ట్రుడితో, "రాజా, కృష్ణార్జునులు అవతార పురుషులు, మహావీరులు. కృష్ణుణ్ణి మూడు లోకాలూ ఏకమై కూడా తేరిపార చూడలేవు. అలాటి కృష్ణుడు నీ కొడుకులను నిర్మూలించ సంకల్పించాడు," అన్నాడు.

"సంజయా, ఈ రహస్యం నీకెలా తెలిసింది? నా కెందుకు తెలియలేదు?" అని ధృతరాష్ట్రుడు అడిగాడు.

47. కృష్ణరాయబారం



"రాజా, నువు విద్యా విహీనుడివి, తమస్సుతో నిండినవాడివి. నేను విద్యద్వారా కృష్ణుడి మహత్తు తెలుసుకున్నాను," అన్నాడు సంజయుడు.

వ్యాసుడు ధృతరాష్ట్రుడితో, "నువ్వంటే కృష్ణుడికి చాలా ఇష్టం. ఈ సంజయుడు కృష్ణుడి సంగతి పూర్తిగా తెలిసినవాడు. ఇతను చెప్పినట్టు చేస్తే నీకు లాభం కలుగుతుంది," అని చెప్పాడు.

ఈ లోపుగా ఉపప్లావ్యంలో, సంజయుడు తన రాయబారం ముగించి, హస్తినాపురానికి తిరిగి వెళ్ళిపోగానే, ధర్మరాజు కృష్ణుడితో, "కృష్ణా, ఇదే మాకు మిత్రులు సహాయపడదగిన సమయం. ఈ ఆపత్సమయంలో మమ్మల్ని ఆదుకోగల వాడివి నువు ఒక్కడివే. నిన్ను నమ్ముకునే మేము కౌరవులను నాశనం చేయ సంకల్పించాం. మమ్మల్ని కాపాడే భారం నీదే!" అన్నాడు.

"నువు ఏమి చెప్పదలచావో అది నిశ్శంకగా చెప్పు," అన్నాడు కృష్ణుడు.

ధర్మరాజు ఇలా అన్నాడు:

"సంజయుడు చెప్పినదంతా విన్నావు గదా. ధృతరాష్ట్రుడు చెప్పమన్న మాటలే అతను చెప్పాడు. ఆ ముసలి లోభి మాకు రాజ్యం ఇవ్వకుండానే మా నుంచి శాంతి కోరుతున్నాడు. ధృతరాష్ట్రుడి నిజాయితీని నమ్మి మేము ఘోరమైన అరణ్యవాసం అనుభవించాం. కాని ఆయన దుర్యోధనుడి ఇష్టానుసారమే పోతాడు. నేను నా తల్లికి గాని, హితులకుగాని కొంచెం కూడా సుఖం కలిగించలేకపోయాను. కనీసం మా అయిదుగురికీ అయిదు ఊళ్ళు ఇస్తే యుద్ధం మానేస్తానన్నాను. ధృతరాష్ట్రుడు అందుకు కూడా సిద్ధంగా లేడు. దారిద్ర్యం కన్న చావు మేలు. క్షత్రియధర్మం చాలా పాపిష్ఠిది. కాని క్షత్రియులమైన మేము ఆ ధర్మాన్ని విడిచి, ఇతర వృత్తులను అనుసరించలేం. అందుచేత మేము శాంతి మార్గాన్నే కోరుతున్నాం. అది పనికిరానప్పుడు యుద్ధం ఉండనే ఉన్నది. అందుచేత ఇప్పుడు మాకు ఏది కర్తవ్యమో చెప్పు."

దానికి కృష్ణుడు, "రాజా, నాకు మీరూ, వారూ ఒకటే. మీ ఉభయపక్షాల శ్రేయస్సు కోరి నేను కౌరవుల వద్దకు పోతాను. మీ ఆశయాలకు భంగం కలగకుండా కౌరవులకు శాంతి కలిగేటట్టు చేశానంటే నాకు ఎంతో పుణ్యం వస్తుంది. ఎంతో మందికి చావు రాకుండా చేసినవాణ్ణి అవుతాను," అన్నాడు.

ధర్మరాజు ఇందుకు సమ్మతించక, "దుర్మార్గుడైన దుర్యోధనుడు నీ మాట వినడు. అతని వద్ద చేరిన రాజులందరూ అతని ధోరణి గల వాళ్ళే. అలాటి వాళ్ళ మధ్యకు నువ్వు వెళ్ళటం నాకెంతమాత్రమూ ఇష్టం లేదు. నీకు లేశ మాత్రం బాధ కలిగినా నేను సహించలేను," అన్నాడు.

దానికి కృష్ణుడు, "ధర్మరాజా, దుర్యోధనుడి సంగతి నే నెరుగుదును. అక్కడి వాళ్ళకు నా సంగతీ తెలుసు. వాళ్ళు నా జోలికి రావటానికి సాహసించరు. ఒక వేళ వస్తే అందరినీ భస్మీపటలం చేస్తాను. మనం శాంతికోసం ప్రయత్నించకపోతే లోకాపవాదానికి గురిఅవుతాం. అందుచేత నేను అక్కడికి వెళ్ళటం అవసరమే," అన్నాడు.

"నీకు ఎదురు చెప్పటానికి నేనెంతవాణ్ణి? నువు క్షేమంగా వెళ్ళి, మా కార్యం చక్కబెట్టి, శాంతి సాధించి, తిరిగిరా. అవసరాన్ని బట్టి మంచిగానూ, కరుకుగానూ మాట్లాడు.



నువు ఏం చెప్పాలో నీకు నేను చెప్పాలా?" అన్నాడు ధర్మరాజు.

దానికి కృష్ణుడు, "ధర్మరాజా, నువు ధర్మాన్ని ఆశ్రయించావు. కౌరవులు వైరాన్ని ఆశ్రయించారు. క్షత్రియుడు జయించినా, మరణించినా యుద్ధం చెయ్యటమే అతని ధర్మంగాని బిచ్చమెత్తుకోవడం కాదు. వాళ్ళు చాలామంది స్నేహితులను చాలా కాలంగా సమకూర్చుకుని బలవంతులై ఉన్నారు. వారు శాంతికి ఒప్పుకుంటారనుకోకు. నువు మెత్తగా కనబడినంత కాలమూ వాళ్ళు నీ రాజ్యం అనుభవిస్తూనే ఉంటారు. నీకు చేసిన ద్రోహాలకు వాళ్ళు కొంచెమైనా పశ్చాత్తాపపడటం లేదు.



వాళ్ళను నువు దయతలచకు. నువు ధృత రాష్ట్రుణ్ణీ, భీష్ముణ్ణీ తలుచుకుని భక్తి భావం చూపటం నాకు కొంచెం కూడా నచ్చలేదు. నేను వెళ్ళి, కౌరవ సభలో అందరి అపోహలూ తొలగించి, నీ ధర్మబుద్ధి అంద రికీ అర్థమయేటట్టు చేస్తాను. నేను నీకు నష్టం కలగకుండా శాంతి కోసమే ప్రయ త్నిస్తానుగాని, పరిస్థితి చూస్తే యుద్ధం తప్ప దనే నాకు అనిపిస్తున్నది. దుర్యోధనుడు బతికి ఉండగా నీ రాజ్యం నీకు దక్కదు. అందుచేత తగు ప్రయత్నంలో ఉండు," అన్నాడు.

అప్పుడు భీముడు కృష్ణుడితో, "కృష్ణా, నువు కౌరవ సభకు వెళ్ళటం చాలా ఉచి తంగా ఉన్నది. అందరూ వింటూండగా నువు దుర్యోధనుడితో మంచి మాటలు చెప్పి, శాంతి సాధించు. వాడిది రాక్షస స్వభావం. వాడికి మంచిగా చెప్పటం చాలా కష్టమే. అందుచేత వాడితో మరింత స్నేహంగా మాట్లాడాలి. మా వంశానికి ఘోర ప్రమాదం రాకుండా చూడు. నాకుగాని, ధర్మరాజుకుగాని, అర్జునుడికిగాని యుద్ధ కాంక్ష లేదు. మేము శాంతినే కోరుతున్నాం," అన్నాడు.

భీముడన్న ఈ మాటలు విని కృష్ణుడు నిర్ఘాంతపోయాడు. భీముడు ఇంత సాధు వుగా ఎన్నడూ మాట్లాడి ఉండలేదు. భీముడు అలా మాట్లాడటం చూస్తే నిప్పు చల్లగా ఉన్నట్టు తోచింది కృష్ణుడికి. అతను భీముణ్ణి రెచ్చగొట్టే ఉద్దేశంతో ఇలా అన్నాడు:

"భీమా, యుద్ధమంటే ఉత్సాహం గల వాడివి ఇలా నీరుగారి పోయి మాట్లాడుతున్నా వేమిటి? ధృతరాష్ట్రుడి కొడుకులను చంపే ఉద్దేశం వదులుకున్నావా? దుర్యోధనుణ్ణి ఎప్పుడు చంపుతానా అని అహోరాత్రాలు అలమటించినవాడివి. నిన్ను చూస్తే పిచ్చి ఎత్తుతుందేమో ననిపించేది. అలాటి వాడివి శాంతి కోసం దేవులాడటం ఎంత ఆశ్చర్యం! నిజం ఏమిటంటే, నువు బెదిరిపోయావు. అందుకే శాంతి కోరుతున్నావు. నీ పరాక్ర

మాన్నే నువు మరిచావు. నువు మాట్లాడు తుంటే ఇంకెవరో మాట్లాడుతున్నట్టున్నది. ఈ అధైర్యం నీకు సప్పటం లేదు. క్షత్రియుడివి, గొప్ప కార్యాలు సాధించినవాడివి. నీ వంటి వాడు తన ప్రయోజకత్వంతో సంపాదించినది తప్ప అనుభవింప గోరడు."

ఈ మాటలు విని భీముడికి చాలా రోషం వచ్చింది. అతను ఇలా అన్నాడు :

"కృష్ణా, నేను ఒకటి చెబితే, నువు మరొకటి అనుకున్నావు. నాకు యుద్ధమంటే ఇష్టం లేదని ఎలా అనుకున్నావు? ఇంత కాలం నన్ను ఎరిగి ఇదేనా నువు గ్రహించినది? నన్ను తెలిసిన వాళ్ళెవరూ నీలాగా మాట్లాడరు. చెబుతున్నాను విను. నేనే చెప్పుకోవటం తప్ప గాని, నా బలమూ, పౌరుషమూ సాటిలేనివి. నా చేతికి చిక్కిన వాడు ప్రాణాలతో బయటపడలేడు. యుద్ధం జరిగినప్పుడు నా పరాక్రమం నువే చూస్తావు. నా శరీరబలం తగ్గలేదు. నేను భయపడలేదు. మా భరతవంశం నాశనం కావటం ఇష్టం లేకనే నేను నీతో శాంతవచనాలు చెప్పాను."

ఈ మాటలకు కృష్ణుడు నవ్వి, "భీమా, నిన్ను నిందించటానికి నేను అలా అనలేదు. నీ శక్తులు నీ కన్న కూడా నాకు బాగా తెలుసు. నేను కౌరవసభలో మీ ప్రయోజనంతోబాటు శాంతి సాధించటానికే ప్రయ



త్నిస్తాను. కాని నా ప్రయత్నం నెరవేరక పోతే యుద్ధం తప్పదు. అప్పుడు భారమంతా నీ మీదనే ఉండబోతుంది. నేనైా యుద్ధం కోరను. నీ మనసు తెలుసుకోగోరి అలా అన్నాను, అంతే!" అన్నాడు.

తరవాత అర్జునుడు కృష్ణుడితో, "కౌరవ సభలో నువు చెప్పదగినది ధర్మరాజు చెప్పాడు. కౌరవులు శాంతికి అంగీకరించరని నువు అనుకుంటున్నట్టు కనబడుతున్నది. అదే జరగవచ్చు కూడా. అయినా ప్రయత్నించకుండా ఉండరాదు. మాకూ మాకూ సఖ్యం కలిగేటట్టు ప్రయత్నించు. అది నీకు అసాధ్యం కాదనుకుంటాను. లేదా, నువు మరొక విధంగా నిర్ణయించినా



కాని ఇవేవీ అమలు కాకపోవచ్చు. పరిస్థితిని బట్టి అందరి అభిప్రాయాలూ మారుతాయి. కనక పరిస్థితిని బట్టి చెయ్యవలసినది చెయ్యి. శాంతంగా మాట్లాడి లాభం లేకపోతే పరుషంగానే మాట్లాడు," అన్నాడు.

సహదేవుడు కృష్ణుడితో, "ధర్మరాజు ధర్మమే చెప్పాడు గాని, నువు మటుకు తప్పక యుద్ధం జరిగేటట్టు చూడు. వాళ్ళు శాంతి కావాలన్నా కూడా ఆ ప్రయత్నం చెడగొట్టు," అన్నాడు.

సాత్యకి సహదేవుణ్ణి బలపరిచాడు. పాండవుల పక్షాన వచ్చిన యోధులందరూ సింహనాదాలు చేశారు.

దానివల్ల మాకు మేలే అవుతుంది. వాళ్ళను చంపటం తప్పనిసరి అయితే అలాగే చేయవచ్చు. మాకు ఏది మేలో అది నువే నిర్ణయించు," అన్నాడు.

"అర్జునా, నేను చేయవలసిన ప్రయత్నమంతా చేస్తాను. శకుని కర్ణులు ఎగదోస్తూ ఉండగా దుర్యోధనుడు మంచిగా మీకు రాజ్యం ఇవ్వడు. ధర్మరాజు శాంతి కోరుతున్నట్టు ఆ దుర్మార్గుడితో చెప్పగూడదనుకుంటున్నాను. వాడి సంగతి తెలియనట్టు మాట్లాడతా వెందుకు?" అన్నాడు కృష్ణుడు.

తరవాత నకులుడు కృష్ణుడితో, "మా అన్నలు తమ అభిప్రాయాలు చెప్పారు. నీ అభిప్రాయం నీ కున్నది.

అప్పుడు ద్రౌపది దుఃఖిస్తూ కృష్ణుడితో, "ధర్మరాజు శాంతి కోరి అయిదూళ్ళు చాలునన్నా ఆ దుర్యోధనుడు ఒప్పుకోలేదు. పాండవులకు రాజ్యం ఇస్తేనే గాని నువు శాంతికి ఒప్పుకోకు. యుద్ధంలో పాండవులు కౌరవులను చంపగలరు. అదే వారికి సరిఅయిన మార్గం. నాకు తీరని అవమానం చేసిన ఆ దుర్యోధనుడు ఇంకా బతికే ఉన్నాడు. నువు సంధి మాటలు మాట్లాడేటప్పుడు నా జుట్టును మరిచిపోకు. ఇది పట్టుకునే నన్ను నిండుసభలోకి ఈడ్చుకు వచ్చారు. దుశ్శాసనుడి చెయ్యి తెగిపడటం చూస్తే గాని నాకు శాంతి కలగదు," అంటూ శరీరం అదిరేటట్టుగా ఏడ్చింది.

కృష్ణుడు ఆమెను తగిన విధంగా ఓదార్చాడు.

కృష్ణుడు పాండవుల రాయబారిగా బయలుదేరుతూ. సాత్యకితో, "సాత్యకీ, నా రథంలో శంఖమూ, చక్రమూ, గదా, ఇతర ఆయుధాలూ పెట్టు. దుర్యోధనుడు దుర్మార్గుడు. అతనికన్న దుర్మార్గులు కర్ణ శకునులు. ఎంతటి బలవంతుడైనా శత్రువు బలహీనుడని నిర్లక్ష్యం చెయ్యరాదు," అన్నాడు.

అంతా సిద్ధమయాక కృష్ణుడు తన రథంలో సాత్యకిని కూడా ఎక్కించుకుని హస్తినాపురానికి బయలుదేరాడు. పాండవులూ, చేకితానుడూ, ధృష్టకేతుడూ, ద్రుపదుడూ, కాశీరాజూ, శిఖండీ, ధృష్టద్యుమ్నుడూ, విరాటుడూ మొదలైన రాజులు కృష్ణుణ్ణి కొంతదూరం సాగనంపారు.

వాళ్ళు తిరిగి వెళ్ళేటప్పుడు ధర్మరాజు కృష్ణుణ్ణి కౌగలించుకుని, "కృష్ణా, మా అమ్మను, కుంతిని కుశలం అడుగు. ఆమె మమ్మల్ని ఎంతో గారాబంగా పెంచింది; మాకు ఏ ఆపదా రాకుండా వెయ్యి కళ్ళతో కాపాడింది; మా మూలాన పడరాని పాట్లుపడ్డది. మా అందరి పక్షానా నువ్వు ఆమెను కౌగలించుకో. ఆమెను ఓదార్చు. ధృతరాష్ట్రుడూ, భీష్మ ద్రోణ కృపులూ, బాహ్లిక సోమదత్తులూ, అశ్వత్థామా మొదలైన పెద్దలందరికీ నా నమస్కారాలు చెప్పి, కుశలం అడుగు. విదురుణ్ణి నాకు బదులు కౌగలించుకో," అన్నాడు.

తరవాత సాగనంప వచ్చిన వారందరూ కృష్ణుడి వద్ద సెలవు పుచ్చుకుని వెనక్కు మరలి వెళ్ళారు.

దారుకుడు తోలుతున్న కృష్ణుడి రథం అమిత వేగంగా ప్రయాణం సాగించింది. కృష్ణుడు కౌరవుల రాజ్యం ప్రవేశించి, వృకస్థలంలో ఆ రాత్రి మజిలీ చేయ నిశ్చయించాడు. అక్కడ అతను విడిదిలో దిగగానే ఆ గ్రామంలోని పెద్దలందరూ అతన్ని చూడవచ్చి, అతన్ని తమ ఇళ్ళకు తీసుకుపోయి, సత్కరించారు. కృష్ణుడు వారికి తన విడిదిలో ఆతిథ్యం ఇచ్చి, సత్కరించాడు.





## 2

భీమావతి అనే ఊళ్ళో శివభక్తుడైన సోమయాజి ఒకడు ఉండేవాడు. ఆయనకు సిద్ధరాముడు అని ఒక కొడుకు కలిగాడు. ఆ కుర్రవాడి ఏడవఏట సోమయాజి మరణించాడు. తండ్రి లేని ఆ ఏక పుత్రుణ్ణి తల్లి ఎంతో శ్రద్ధగా పెంచుతూ వచ్చింది.

దీపావళి ఇంకా కొన్ని రోజులుందనగా ఒక నాడు రాముడు, తన ఈడు కుర్రవాళ్ళతో బాటు, సమిధలూ, ఆకులూ తీసుకురావటానికి వనానికి వెళ్ళాడు. అక్కడ పిల్లలందరూ ఒక మర్రిచెట్టు కింద కూర్చుని కబుర్లు చెప్పుకోసాగారు.

"వచ్చే దీపావళికి మా అక్కనూ, బావనూ తెస్తాం. పండగకు మా ఇంట్లో అప్పాలు చేసుకుంటాం. అరిసెలు చేసుకుంటాం. కజ్జికాయలు చేసుకుంటాం. పూరీలు చేసుకుంటాం. గారెలు వండుకుంటాం. మా అక్కకూ, బావకూ బట్టలు పెడతాం," ఈ విధంగా కుర్రవాళ్ళందరూ చెప్పుకుంటున్నారు.

ఆ మాటలు విని రాముడు, "నేను కూడా పండగకు మా అక్కనూ, బావనూ తెస్తాను. మా ఇంట్లో పాయసం వండుకుంటాం. మా అక్కకూ, బావకూ సన్నని బట్టలు పెడతాం," అన్నాడు.

ఈ మాటలకు పిల్లలందరూ వెటకారంగా నవ్వి, "నీకు మొదలు అక్కే లేదు గదా, బావ ఎలా ఉంటాడురా? మా దగ్గిరే దంభాలు పలుకుతున్నావా? చెప్పు, నీ అక్క ఎవరు? పేరేమిటి? మీ బావ పేరేమిటి? ఆయన ఎక్కడ ఉంటాడు? ఏం చేస్తాడు? ఏం చదువుకున్నాడు? వాళ్ళ కెంత మంది పిల్లలు?" అని సిద్ధరాముడి మీద ప్రశ్నల వర్షం కురిపించారు.

అట్ట చివరి బొమ్మ



వాళ్ళ ప్రశ్నలకు సమాధానం చెప్పలేక, అవమానంతో ఏడుస్తూ రాముడు ఇంటికి తిరిగి వచ్చాడు.

కొడుకు ఏడుస్తూ రావటం చూసి తల్లి వాణ్ణి దగ్గిరికి తీసి, కన్నీరుతుడుస్తూ, "ఏం, నాయనా? పడ్డావా? దెబ్బ తగిలిందా? ఎవరన్నా కొట్టారా? ఏం జరిగింది?" అని అడిగింది.

రాముడు తల్లికి తన తోటిపిల్లలు చేసిన ఎగతాళి గురించి చెప్పాడు.

అంతా విని తల్లి, "వాళ్ళ మాటలకేంరా? మీ అక్క పేరు భ్రమరాంబ. మీ బావ మల్లన్న. వాళ్ళు శ్రీశైలపర్వతం మీద ఉంటారు. వాళ్ళు అష్టఐశ్వర్యాలుగల వాళ్ళు. గణపతీ, కుమారస్వామీ అని వారికి కొడుకులున్నారు. మీ బావ సర్వేశ్వరుడు. లోకాలన్నీ ఆయన చెప్పినట్టు నడుచుకుంటాయి. నీ బావలాటి బావ ప్రపంచంలో ఎవరికీ లేడురా!" అన్నది.

ఈ మాటలు విని రాముడు పొంగిపోయి, "అయితే వచ్చే దీపావళికి వాళ్ళను తీసుకొద్దామమ్మా. అందరి అక్కలూ, బావలూ పండగకు వస్తున్నారు. మనం నా అక్కనూ, బావనూ ఎప్పుడూ తీసుకురాలేదు," అన్నాడు.

"నాయనా, మీ తండ్రి పోయాక వాళ్ళను ఎవరు పిలుచుకు వస్తారు? నువ్వేమో పసివాడివి. దారి అంతా అరణ్యం. అందులో సింహాలూ, పెద్దపులులూ, ఎలుగుబంట్లూ, నాగుపాములూనూ; కాకపోయినా మీ బావ వంటి ఐశ్వర్యవంతుడు మన పేద ఇంటికి ఎందుకు వస్తాడు? ఆయన ఒంటరిగా రాడాయె; పెద్ద పరివారంతో వస్తాడు. ఒక పూట తింటే ఇంకోపూట తినలేని మనం వారి కందరికీ ఎలా తిండి పెట్టగలం? నువు పెద్ద వాడివై, సంపాదించేటప్పుడు మీ అక్కనూ, బావనూ తీసుకొద్దువు గాని!" అన్నది తల్లి రాముడితో.

రాముడు అప్పటి కేమీ అనక, మర్నాడు తూర్పు తెల్లవారక ముందే లేచి, తల్లికి చెప్పకుండా ఇంటి నుంచి బయలుదేరి, కనిపించిన వారినందరినీ శ్రీశైలానికి దారి

అడుగుతూ, క్రూరమృగాలను లక్ష్యపెట్టక, అరణ్యాలకుండా నడిచి చివరకు శ్రీశైలం చేరాడు. అక్కడ ఎన్నో తీర్థాలూ, ఆల యాలూ ఉన్నాయి. రాముడు తన అక్క, బావల కోసం అంతటా చెడ తిరిగాడు. "మల్లికార్జునుడు ఎక్కడ ఉంటాడు?" అని ఎవరినో అడిగితే, వాళ్ళు రాముడికి దేవాలయం చూపారు. అందులోకి వెళ్ళి చూస్తే లింగం తప్ప ఏమీ లేదు.

అప్పటికే రాముడు చాలా అలిసిపోయి ఉన్నాడు. వాడు ఆ లింగానికి ఎదురుగా కూర్చుని, "బావా, నిన్నూ అక్కనూ దీపా వళికి తీసుకు పోదామని, ఎవరితోనూ చెప్ప కుండా బయలుదేరి, చాలా శ్రమపడి వచ్చాను. మా ఊళ్ళో అందరి అక్కలూ, బావలూ పండగకు వస్తున్నారు. మా అమ్మ మీ ఇద్దరినీ చూడటానికి వెయ్యికళ్ళతో ఎదురు చూస్తున్నది. ఇన్నాళ్లూ పిలవ లేదని అలిగి, కనబడకుండా ఉన్నావా? నువు ఎంత ధనికుడవైతే మాత్రం బంధుత్వం పోతుందా? మేము పేదవాళ్ళమనుకోక మా ఇంటికి రా. నిన్ను తీసుకు పోకుండా నేను తిరిగి పోను," అన్నాడు.

రాముడి వేడుకోలు అరణ్యరోదన మయింది. వాడు తన అక్కను కూడా ఇదే విధంగా బతిమాలుకున్నాడు, కాని లాభం లేకపోయింది.



భరించరాని నిరాశతో రాముడు ఆత్మ హత్య చేసుకోవటానికి నిశ్చయించుకున్నాడు. అక్కనూ, బావనూ తీసుకు వస్తానని ప్రగ ల్భాలు పలికి తీసుకు రాలేకపోతే తోటివాళ్ల దగ్గిర ఎంత అవమానం! ఆ అవమానం భరించే కన్న చావటం మేలు. ఆ చచ్చేది అక్కా, బావలున్న చోటే చస్తే ఆ మాట వారికే వస్తుంది.

ఇలా అనుకుని రాముడు కొండశిఖరం ఎక్కి, అక్కడి నుంచి కిందికి దూక పోయాడు.

అంతలోనే అతని భుజాలు ఎవరో పట్టు కున్నారు. ఒక పక్క మగవాడూ, ఒక పక్క ఆడదీ ఉన్నారు.

"ఎవరు మీరు ? చచ్చిపోదామనుకున్న నన్ను మీరు ఎందుకు ఆపుతున్నారు? నా అక్కకూ, నా బావకూ లేని జాలి నా మీద మీ కెందుకు ?" అని అడిగాడు రాముడు.

అప్పుడు ఆ స్త్రీ, "మేం పరాయివాళ్ళం కాదు, తమ్ముడూ! నేను నీ అక్కను, భ్రమరాంబను. ఈయన మీ బావగారు. మమ్మల్ని ఎన్నడూ చూసి ఎరగవు. అందు చేత గుర్తు పట్టలేకపోయావు. సోమయాజులు గారి అబ్బాయి ఇక్కడ తిరుగుతున్నాడంటే నిన్ను వెతుక్కుంటూ వస్తున్నాం," అన్నది.

రాముడు పరమానందభరితుడై అక్కకూ, బావకూ మొక్కాడు. వాళ్ళు రాముడికి తమ కొడుకులనూ, పరివారాన్నీ చూపించారు. రాముడు వారిని తన వెంట రమ్మన్నాడు.

ఈ లోపల రాముడి తల్లి కొడుకును కానక, ఏమైనాడోనని తల్లడిల్లి పోయింది. తన మాటలు నిజమని నమ్మి కుర్రవాడు శ్రీశైలం పోయి ఉంటాడనుకుని ఆమె అమితంగా భయపడింది.

కొద్దిరోజులు గడిచాయి. పండగ వచ్చింది. దానితోపాటే ఉదయం పూట రాముడు ఇంటికి తిరిగి వచ్చి, అక్కనూ, బావనూ వారి పరివారాన్నీ తీసుకు వచ్చాననీ, వారంతా ఆలయం వద్ద ఉన్నారనీ చెప్పాడు. రాముడి తల్లి ఆనందాశ్చర్యాలతో ఆలయానికి వెళ్ళి, పార్వతీ పరమేశ్వరులనూ, వినాయకుణ్ణీ, కుమారస్వామినీ, వారి పరివారాన్నీ కళ్ళారా సందర్శించి, అందరినీ తమ ఇంటికి ఆహ్వానించింది.

వారంతా వచ్చేసరికి వారి పాత ఇంటికి మారుగా ఒక దివ్యభవనం ఉన్నది. అతిధులు అందులో ప్రవేశించారు. ఆ రోజు ఊళ్ళో వాళ్ళు, కొత్తగా వెలిసిన ఆ ఇంటిని చూసి ఆశ్చర్యపోయారు. బయటి ద్వారాలు మూసి ఉన్నాయి. లోపల అంతులేని జనం ఉన్నట్టు సందడిగా ఉన్నది.

దీపావళికి రాముడి అతిధులుగా వచ్చిన పార్వతీ పరమేశ్వరులు, రాముణ్ణీ, అతని తల్లినీ తమ వెంట కైలాసానికి తీసుకు వెళ్ళారు.



# 134. "డ్రాగన్" వృక్షం

కెనరీస్ దీవులలో ఒకటి అయిన టెనెరీఫ్ దీవిలో ఉన్న ఈ వింత వృక్షం దిగువభాగం చుట్టు కొలత 50 అడుగులు. దీనిని "డ్రాగన్" వృక్షం అంటారు. ఈ వృక్షాలు దీర్ఘకాలం బతుకుతాయి. ఈ బొమ్మ లోని చెటు వయసు 3,000 ఏళ్ళని ప్రతీతి. ఈ చెట్టు నుంచి కారే ఎర్రని బంకలాటి ద్రవాన్ని ఇక్కడి ఆదిమవాసులు గొప్పవారి శవాలను చెడకుండా ఉంచటానికి ఉపయోగించేవారు.



Photo by P. Balaji Rao



బహుమతి
పొందిన వ్యాఖ్య

తీస్తామంటేరావు

పంపినవారు:
గొరిశెట్టి విశ్వనాథం

Photo by P. Balaji Rao



జగత్యాల.
కరీంనగర్ జిల్లా.

తిందామంటే లేవు

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు





★ వ్యాఖ్యలు ఫిబ్రవరి నెల 20 వ తేదీలోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు ఏప్రిల్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రిపబ్లిక్ డే: దీపాలంకరణ

రెండవ అట్ట: మద్రాసు సెంట్రల్

మూడవ అట్ట: మద్రాసు రిప్పన్ బిల్డింగ్

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'



# అధిక పుష్టినిచ్చే బ్రిటా బిస్కట్లు తక్కువ ధరకు ఎక్కువ బిస్కట్లు

బ్రిటానియా బ్రిటా బిస్కట్ల నిండుగా పిల్లలకు పుష్టినిచ్చే పదార్థాలున్నాయి. అవి ఎంతో పసందుగా కూడా వుంటాయి. ఈ చిన్నచిన్న బిస్కట్లను మీరెంతో ప్రీతితో తినగలరు. పైగా తక్కువ ధరకే ఎక్కువ బిస్కట్లు లభిస్తాయి.



## బ్రిటానియా బ్రిటా బిస్కట్లు

భారతదేశంలో అతి శ్రేష్ఠమైన బిస్కట్లు బ్రిటానియా

BBC-2768

# సరిగ్గా ఆడాడు...

























ఫోర్‌హాన్స్

దంతవైద్యునిచే సృష్టింపబడిన టూత్ పేస్ట్

49F-203R-TEL




*Photo by:* **PUSHPA**

